# విషాదజీవులు



రచన

నల్లా నారాయణరావు

(వింధ్యశ్రీ)



ఎ. 12 ఎ

# విషాదజీవులు

35/8

రచన:

నల్లా నారాయణరావు

( వింధ్యశ్రీ )

- అమరశిల్పులు
- నిరీక్షణ
- విషాదజీవులు
- అనార్కలి
- మాతృశ్రీ
- ఖైదీ

కళానిలయ ప్రథమ పుష్పాంజలి

*

ముద్రణ :
జెమిని ప్రింటర్స్, ఏలూరు

*

ప్రథమ ప్రచురణ :
1 జూన్ 1950
వేయి ప్రతులు.

*

మూల్యం : ముప్పావలా.

*

ప్రతులకు :
ఫేమస్ బుక్ హౌస్, ఏలూరు.



అంకితం:

చీకటి కోణాల్లో చివికి జీర్ణించిపోతున్న

విషాద హృదయాలకు.



# ఆశీస్సులు

శ్రీ నల్లా నారాయణరావుగారిచే రచింపబడిన "విషాదజీవులు" అను ఆరు కథల సంపుటిని చదివి ఆనందించినాను. ఈ కథలన్నియు సమాజమును పాతుకొనియున్న భేదములను ఆధారముచేసుకొని వ్రాయబడియున్నవి. అందు ప్రధానమైన భేదము "కలవారు", "లేనివారు" అనునది. నిన్న మొన్నటి వరకును ఆంధ్రవాఙ్మయమున కలవారి జీవితమే ప్రతిబింబించినది. లేనివారి కడగండ్లను గమనించిన వారే లేకపోయిరి. ప్రగతి శీలమైన వాఙ్మయమున అసంఖ్యాకులగు వారి జీవితమునందలి కష్టసుఖములును వారి సమస్యలును చక్కగ ప్రతిబింబించవలెను. లేనిచో వాఙ్మయము నేలవిడిచి సాముచేయుటయగును. పరిణితిగన్న కళానిర్మాణమున సమస్యలకు ప్రత్యక్ష పరిష్కారములు స్పష్టముగ కనుపించదగదు. నిజమగు కళ తన్నుతాను మరుగుపరుచుకొనును. రసజ్ఞుల హృదయములలో ప్రతిస్పందములు బయలుదేరి వ్యక్తిగతముగా వారి వారి సంస్కారానుగుణముగ సమస్యాపరిష్కారములు స్ఫురించును. ఈ కథలలో ప్రత్యక్షముగా యే సమస్యలును పరిష్కరింపబడక పోయినను. పరిష్కారములు స్ఫురించుచునే యున్నవి. అందువలననే నీ కథలవిలువ హెచ్చినదని నే ననుకొనుచున్నాను.

ఈ కథలలో భాష సరళముగను, సుగమముగను, వ్యావహారికమున చక్కగా సాగినది. ఇతడు ముందుముందు మరింత చక్కని సాహిత్యమును నిర్మించి సుప్రసిద్ధుడగునని యాశించుచున్నాను.

—సోమంచి లింగయ్య, బి.ఎ., బి.ఎల్.

# నే న నే ది

"విషాద జీవులు" కథలన్నీ చదివాను బావున్నాయి. అనువదించిన ఆ కథ వోహాటీ యీ గుచ్ఛంలో అంటించి నట్టుంది. చిన్న కథలకు ఆయువుపట్టయిన కొసమెరుపులుంటే కథలింకా రాణించేవి. అన్నిటికన్నా రచయిత మాంచి వుత్సాహశాలి. కళాశీలి. ముందుముందు వీరి కలం రాజనప్పంట పండించ గలదని ఆశించవచ్చు, విశ్వసించవచ్చునున్నూ !

—బొడ్డు బాపిరాజు

రచయిత చిరదగ్ధ కళాహృదయాల్ని సూక్ష్మాతిసూక్ష్మమైన మార్మిక కళామానాన్ని గ్రహించి విభజించాడు. 'కళ' కళకొరకేగాదు ; సమాజముకొరకు గూడ నన్న సిద్ధాంతము ఇందున్న ప్రతి ఒక్కకథలోను తొణికిసలాడుచున్నది.

—పిన్నింటి సత్యనారాయణ

# అమర శిల్పులు

అది అమరావతీపట్టణ పరిసరప్రాంతము. అతడు శిల్పవంశి, ఫలితకేశము, ముడివడ్డ కనుబొమలు, ఆలోచనా నిమగ్న నేత్రాలు, ఋషిసాంప్రదాయాన్ని సూచించే తెల్లనిగడ్డం; వృద్ధాప్యానికి అనుగుణంగా చేతి కండరాలు ముడతలువడి వ్రేళ్లాడుతున్నాయి.

శివాలయానికి ఎదురుగా పాషాణం, నునుమెరుగులు తీర్చిదిద్దే ఉలితో పాషాణానికి ప్రాణములుపోసి అందులోనుండి నందిని తయారు చేస్తున్నాడు ఆ విశ్వశిల్పి.

కాంతులీనే కనులతో, మోర పైకెత్తి, రంకెవేసి, మూపురం విదళించి చెవులు అదలించి మెడసాచి గంగడోలును గోకమంటున్న నందీశ్వరుని జూచి మురిసిపోయాడు, శిల్పి.

తన వంశ పారంపర్య శిల్పత్వానికి ఏ మాత్రం వన్నె తగ్గలేదని నడుం సాపైకెత్తి గడ్డాన్ని సవరించుకున్నాడు.

వంశంపేరు నిల్పావు "సెభాష్" అన్నది అంతరాత్మ.

వృద్ధశిల్పి మనుమడు విజయానందుడు నందీశ్వరుని తోక పట్టుకొని లాగుతూ పడుతూ నందిని లేపుటకు శ్రమపడుతున్నాడు. వృద్ధశిల్పి మనుమడ్ని జూచి దగ్గరకు రమ్మని చేతితో సైగచేసాడు.

"రా నాయనా విజయా! ఏంచేస్తున్నావ్ ?"

"నందిని లేపుతున్నాను తాతా" అన్నాడు విజయానందుడు.

వృద్ధునికి చిరునవ్వు పెదవుల్లో తాండవిస్తోంది. మనుమనితో అన్నాడు "చూశావా నా శిల్పం ?"

"అవును తాతా ! ముద్దొస్తుంది. ఎంత చక్కని నందిని తయారుచేశావు. అటు చూడు దాని కండరాల్లో ఎన్ని వొంపులు ! ఎన్ని సొంపులు ! ! బోలెడన్ని" అని గంతులువేశాడు విజయానందుడు.

"నాయనా విజయా ! నీవుకూడా నాలాగే శిల్పాచార్యుల్ని ఆరాధించి విద్య నార్జించి వంశంపేరు నిల్పు" అన్నాడు వృద్ధ శిల్పి.

విజయానందుని తల చేతితో నిమురుతూ "నాయనా ! నీ తండ్రి అమర శిల్పి, అందుకే దేవతలు అమరలోకానికి నడివయస్సులోనే తీసుకుపోయారు"

"నీ తండ్రి శిల్పచ్ఛాయలు అవిగో ! ఆ పర్వతారామాల్లో చిర విశ్రాంతి తీసుకొంటున్నాయి. వెళ్లి చూడు. ద్వాదశ రామ నాట్యమండపములో నటరాజ విగ్రహం సగమే తయారుచేయబడింది. దానిమీద యింకొకరి చేయి సాగదు. నీవే ఏనాటికైనా దానిని పూర్తిచేయాలి" అన్నాడు వృద్ధ శిల్పి. కాని ఆ పసిపాపకి ఏమి తెలుస్తాయి ఆ వృద్ధ శిల్పి భావార్థాలు !

అలాగే అని తలూపాడు మనుమడు. వృద్ధుడు గర్వపడ్డాడు. అప్పటికే పశ్చిమాద్రికి పోతున్న సూర్యుని కిరణాలు నందీశ్వరునిమీద పడ్డాయి.

నందిలో అపూర్వ సౌందర్యం తాండవిస్తోంది. వృద్ధ శిల్పి అటువైపు పారజూచి గంభీర దృక్కులతో తన చేతి కండరాలని చూచి మనస్సులో అనుకున్నాడు : "ఇంకా ఎన్ని నందుల్ని సృష్టించగల శక్తి మిగిలింది అని" జవాబు వచ్చింది "సరే అయిపోయింది, యిదే ఆఖరు నంది."

వృద్ధ శిల్పి కళ్లలో నీరు నిండింది. హృదయాన్ని ఎడమచేత్తో గట్టిగా అదుముకున్నాడు. అడుగులు తడబడుతూ బరువుగా పడుతున్నాయి. [illegible] గూళ్ళకు చేరుకున్నాయి. తాతా మనుమడు కుటీరమునకు చేరారు...

కొన్నాళ్లు గతించింది. వృద్ధ శిల్పి మరణశయ్యమీదవున్నాడు. మనుమణ్ని దగ్గరగా పిలచి, తన వంశీయులు తనకు మిగిల్చిపోయిన శిల్ప పరికరాలు విజయానందునికి దత్తంచేసి లోకంనుండి దూరమయ్యాడు వృద్ధ శిల్పి.

కాలచక్రం భ్రమిస్తోంది. విజయానందుడు యువకుడై విద్య [illegible]స్తున్నాడు. పరిసరస్థితులు మారుతున్నాయి. కరువు కనుచూపుమేరలో కనపడుతోంది.

పల్లెప్రజలు పట్టణాలకి తరలుతున్నారు. యువక శిల్పి విజయానందునికి కూడా క్షుధాగ్ని జ్వాలలు తగులుతున్నాయి. ఏవిగా పాలుపోవటములేదు. పర్యవసానంకోసం దీర్ఘంగా ఆలోచించాడు. కుటీరాన్ని విడిచి వెళ్లక తప్పదనుకున్నాడు. పర్వతారామాలవైపు చూపు మళ్లింది. తండ్రి సగం చిత్రించి పోయిన నటరాజ విగ్రహం జ్ఞాపకంవచ్చింది. తిన్నగా ద్వాదశారామములోకి వెళ్ళాడు. విగ్రహానికి ఎదురుగా నుంచున్నాడు. హృదయం ద్రవించి పోయింది. తన తండ్రి తనపై విడిచిపోయిన బాధ్యత, తాతగారి అమూల్య బోధనలు చెవుల్లో గింగుర్లుపెడుతున్నాయి.

ప్రాణాలు పోతున్నాసరే నటరాజ శిల్పాన్ని పూర్తిచెయ్యాలనుకున్నాడు. కడుపులో ప్రేవులు మెలికలు తిరిగాయి. ఆకలి జ్ఞాపకం వచ్చింది. వేడి నిట్టూర్పువిడిచాడు. గత్యంతరంలేదు ఏంచేస్తాడు పాపం. విజయానందుడు పట్టినపట్టు విడువని ధీరుడే కాని క్షుధాగ్ని ముందు ఎంతవరకు పురకలుపెట్టగలడు? దైన్యముఖముతో కుటీరానికి చేరుకున్నాడు.

తెల్లవారింది. పక్షులు కిలకిలా రావాలతో తూర్పుదిశగా ప్రయాణమయ్యాయి. విజయానందునినడక పడమరదిశగాసాగింది. పట్టణంసమీపిస్తోంది. నుదుటిమీద చెమట కొనగోటితో తుడుచుకుంటూ దూరంగా కనబడుతున్న భవంతులవైపు చూస్తున్నాడు. అల్లంతదూరంలో కొన్ని పూరిగుడిసెలు కనబడుతున్నాయి. కొద్దిదూరంలో కొందరు కూలీలు రాళ్ళు మోస్తున్నారు. శరీరాలు శుష్కించి కట్టెలల్లె ఎముకలు కనబడుతున్నాయి. ముఖంలో దరిద్రదేవత ముద్రవేసుకుంది. చినిగిన గుడ్డపీలికలు మాత్రం కొన్ని అవయవాలుమీద వ్రేళ్ళాడుతున్నాయి. వారి శరీరాలు యంత్రాలల్లే విధవిరామమెరుగక పరిశ్రమిస్తున్నా, కడుపుమంటకి గుక్కెడు గంజినీళ్ళయినా త్రాగుటకు సమయానికి లేక మండుటెండలో మలమలమాడిపోయే ఆ శ్రమ జీవుల కష్టాలు కళ్ళారచూచి వేడి నిట్టూర్పు విడుస్తూ ఒక కూలీని పిలచి అడిగాడు: "ఈ పాషాణాలన్నీ ఎచ్చటికి మోసుకుపోతున్నారు"?

"ధనవంతుల భవనాలు నిర్మించడానికి"

"ఆ కనపడుతున్న భవనాలన్నీ మీరు నిర్మించినవేనా?"

"అవును"

"మరి మీ నివాసస్థానాలు అవ్వేనా?"

కూలి యీమాటలువిని బిగ్గరగానవ్వి గుడిసెలవైపు వ్రేలుచూపెడుతూ

"అదిగో" ఆ కనపడే భవనాలే మావి, అప్పుడే మా నివాసం."

యువకునివైపు తేరిపార చూస్తూ "నీవు ఎవరో యీ వూరికి క్రొత్త వాడవల్లే యున్నావే? ఏ యూరునుండి?

అమరావతీ ఆరామాల్లో నివసించేవాణ్ని. ఏదైనా పనిచేద్దామని వచ్చానన్నాడు, విజయానందుడు.

"బండలు మోయగలవా?" అన్నాడు కూలి.

"నేను శిల్పిని. శిల్పం మా వంశవృత్తి. బండలు నేనెందుకు మోయాలి?" అన్నాడు విజయానందుడు.

"శిల్పం అంటే ఏమో! తెలియక తలగోక్కుంటూ, నీవు చెప్పేదేంటో నా కేమీ తెలియడంలేదు. పద మా పెద్దదగ్గరకు" అన్నాడు కూలి.

కూలి విజయానందుడు కలసి కూలిపెద్దదగ్గరకు వచ్చారు. ఒక చిన్న గుట్టమీద తాటాకు గొడుగుక్రింద ఏభైయేళ్ళ వ్యక్తి కూలీలతో ఏదో పని చేయిస్తున్నాడు. ఇద్దరివైపు తేరిపార చూశాడు.

"ఎవరీ యువకుడు?" అన్నాడు కూలిపెద్ద, కూలీతో.

"శిల్పట, పొరుగూరు, ఏదైనా పనిచేసుకుందామని వచ్చాడట".
ఇంకోసారి చూచాడు యువకునివైపు కూలిపెద్ద. అదిగో! దూరంగా రాళ్లు చెక్కుతున్నారు, అక్కడికి వెళ్లు అన్నాడు వృద్ధుడు. రాతి కంబాలు చెక్కడానికి నియుక్తుడయ్యాడు, విజయానందుడు.

కొమ్ములు తిరిగిన పనివాళ్లకుగూడా అక్షరాభ్యాసము చేయించేయువకుడు వచ్చాడని తెలిసింది యజమాని శక్తిసింహునికి. ఇంకా సరిగా తెల్లవారనేలేదు, యజమానులు రమ్మంటున్నారని సందేశము తెచ్చాడు నౌకరు.

దొరగారి దృష్టిపడింది త్వరలోనే బాగుపడి పోతాడన్నారు, తోడ వాళ్ళంతా.

బాగుపడకేం? తప్పకుండా బాగుపడతాడు. ఇంతకుముందు మయూరవర్మ, రుద్రభట్టులాంటి కళాకారులు రాల్చిన కన్నీళ్లు యింకా ఆరనేలేదు. ఆ భవనంలో వాళ్ళచేత సృష్టింపబడ్డ శిల్పాలు చూశారా? వాళ్లగతి ఏమైంది కూడా మీ రంతా ఎరిగిందేగా? యీ యజ్ఞపశువుగూడా ఆ యజ్ఞంలోనే ఆహుతి ఔతుంది అన్నాడు ఆవేశంతో ఒక యువకుడు. అవును అదిగూడా నిజమే! అన్నాడు పండిన ముదివగ్గు దగ్గుకుంటూ. విచార సూచకంగా

అంతా తలలువంచి నిజమే! కాని మనవల్ల ఏమౌతుంది? అన్నారు, కూలీలంతా. మబ్బుల్ని చుంభిస్తున్న సౌధరాజాలవైపు సాగింది నడక... అదిగో అన్నిటికంటే ఎత్తైయిన ఆ విశాలభవనమే మన దొరగారి దన్నాడు నొకడు. శత్రువులకుకూడా చొరడానికి అభేధ్యదుర్గంలాగుంది ఆ సౌధం. సింహాముఖాకృతితో బ్రహ్మాండమైన ముఖద్వారమునుండి లోపలకు ప్రవేశించాడు శిల్పి. ఎటుచూచినా ఉద్యానవనాలు, వివిధ ఫలవృక్షాలతో నందనవనములావుంది, అమాయక శిల్పి కళ్లకి. మధ్య మధ్య వివిధ భంగిమాలతో ప్రేక్షకులమాపులు మారకొని మైమరపించే చిత్రాల్ని చూస్తూ ఆ అపూర్వ సౌందర్యాన్ని సృష్టించిన శిల్పులకు కృతజ్ఞాపూర్వకంగా మనస్సులోనే నమస్కరించాడు, యువక శిల్పి విజయానందుడు.

విశాలమైన చావడిలో పట్టుతివాసీమీద బాలీసుకు చేరబడి అధికారగర్వంతో కూర్చున్నాడు యజమాని శక్తిసింహుడు.

దూరంనుండే వినయంగా భక్తిభావము వుట్టిపడేటట్లు కరాలుముకుళించి నమస్కరించాడు యువకశిల్పి.

ధనగర్వంతో మత్తెక్కిన నేత్రాలతో ప్రకృతిస్వరూపి శిల్పిని చూడ్డానికి నా కెక్కడధికారముంది అన్నట్లుగా సగమే తెరచిన కళ్ళతో, సగమే లేచిన చేతితో స్వీకరించాడా నమస్కారాల్ని... ...

"నీ పేరు?"

"విజయానందుడు."

"ఏ వూరినుండి రాక?"

"అమరావతీపరిసరాల్లో చిన్న పల్లె."

"ఎన్నాళ్ళయింది యిచ్చటికి వచ్చి?"

"ఒక పక్షం గతించింది."

"నీవు మంచి పనివాడవని విన్నాం. రేపటినుండి మా సౌధంలోనే శిల్పాలు చెక్కాలి."

"ఎక్కడైతేనేం? అట్లానే చేస్తా" నన్నాడు విజయానందుడు.

"నీ పరికరాలన్నీ సాయంకాలం లోపుగా యిచ్చటికి చేర్చుకో. రేపటి నుంచి పని ప్రారంభించు" అని దర్పంతో ఆజ్ఞజారీచేశాడు, యజమాని శక్తిసింహుడు.

తన శిల్పంలో జగత్తును ప్రతిఫలింపజేసి శిల్పకళాసాగరంలో, లోకాన్ని నిలువెత్తున నిలబెట్టే శిల్పి, కడుపు మంటలకాహుతియై హృదయాన్ని చంపుకొని పరుల రక్తం పీల్చి పిప్పిచేసి వారి శ్రమఫలితంగా మిగిలిన సంపత్తితో మురిసే స్వార్థుని ఆధీనుడైపోయాడు యువకశిల్పి విజయానందుడు. శక్తిసింహుని ఆజ్ఞలకు శిరస్సు వంచాడు కాని హృదయం ఎదురు తిరిగింది. "నన్ను స్వార్థ జీవికి బలిచేస్తావా?" అంది కళాసరస్వతి.

"ఏం చెయ్యను? గత్యంతరం లే" దన్నాడు శిల్పి. కళాసరస్వతి నరనాడులు ఒక్కసారిగా స్తంభించాయి. విజయానందుడు చూడలేక రెండు కళ్లు గట్టిగా మూసుకున్నాడు. ఆ విశాల భవన ప్రాంగణములో దక్షిణ దిశగా గోశాల. ఆ గోశాల్లోనే ఒక మూల కొద్దిచోటు చూపించాడు విజయానందునికి పరిచారికుడు. అవి జాతి భేదాలు కరుడు కట్టిన రోజులు. శిల్పి ఏజాతి వాడో తెలియక మట్టిపాత్రలోనే తగుపాటి ఆహారం పంపబడుతోంది శిల్పికి. ఉదయమే పని ప్రారంభించాడు విజయానందుడు. తదేక దృష్టితో చెక్క బోయే శిల్పానికి ఛాయలుదిద్దుకుంటున్నాడు. ఇంతలో వెనుకనుండి యజమాని, నౌకరువచ్చి నిలబడ్డారు. శిల్పి వారిని చూడలేదు.

"ఓయీ శిల్పీ! త్వరగా ప్రారంభించు. కాలాన్ని యిలా వ్యర్థం చేస్తే నీకు పెట్టే భోజనం వూరికినే వస్తుందనుకున్నావా?" అని గదమాయించాడు యజమాని. విజయానందుని హృదయం చివుక్కుమంది. జవాబు చెప్పలేదు.

"కూర్చోబెట్టి పోషించడానికి నిన్ను యిక్కడికి తీసుకురాలేదు. నీ విట్లాచేస్తే మేము నిర్బంధంగా, నిర్దాక్షిణ్యంగా చూడవలసి వస్తుంది. జాగ్రత్త" అన్నాడు యజమాని.

రోజులు గడుస్తున్నాయి దివారాత్రాలు కష్టించి శ్రమించినా యజమాని మెప్పు దొరుకుటలేదు. కఠినపరిశ్రమమూలంగా, శరీరం కృషించి పోతోంది. ఒక వైపు ఆత్మధిక్కారం, ఒక వైపు అవమానం సహించడం, రోజురోజు దుర్భరంగాయుంది విజయానందుడికి. కాని ఏం చేస్తాడు పాపం, నిస్సహాయుడు. కాలచక్ర భ్రమణరీతులు తెలియని అమాయకుడు. అపరూప శిల్పాలు తయారవుతున్నాయి, కాని వాటి నేత్రాలు అశ్రుపూరితాలు. కారణం శిల్పిహృదయానికి దక్క ఎవ్వరికీ తెలియడంలేదు. శిల్పములలో శిల్పి వేదన ప్రతిబింబిస్తుంది. ఎంతో ప్రయత్నించి ముఖచ్ఛాయలు మార్చలేక నిర్వీర్యుడయ్యాడు విజయానందుడు. అది నిశాసమయం, జీవులన్నీ నిద్రా

దేవి కౌగిటిలో నిద్రపోతున్నాయి. శిల్పి హృదయంమాత్రం మేలుకొని ఏవో స్వప్నాలు కంటోంది. ఆ కలతనిద్రలో ఎవరో వ్యక్తి దీనవదనంతో, ఆశా దృష్టులతో, అవ్యక్తరూపంతో లేపుతున్నట్లు కళ్ళకి గోచరిస్తున్నాడు. తన హృదయానుభావాల్ని శిల్పి హృదయంలోకి జొప్పించి ఏనాడో ఎండి మొండి ప్రాంకులైపోయిన ఆదర్శ భావిజీవిత ప్రోదిబోదికి నీళ్ళు పోస్తున్నట్లుగా యుంది విజయానందుని భావన.

భాషలో చెప్పుకోలేని మధురమైన బాధ ఏదో వేధిస్తోంది అతని అంతరాళాన్ని, ఆ నిద్రలోనే చిత్రవిచిత్రమైన అనుభూతులు పొందు తున్నాడు. క్షణంలో ఉత్తుంగ పర్వతశిఖరాల్ని అందుకుంటున్నాడు. మరు క్షణంలోనే, అగాధ గంభీర పాతాళలోయల్లో కలిసిపోతున్నాడు. చెప్ప రాలని ఆవేదన భరింపరాని బాధ......

కళ్ళు తెరచాడు మౌనంగా నిమీలిత నేత్రాలతో మనోభావాల్ని పరికించుకుంటున్నాడు.

గత చరిత్రలన్నీ జ్ఞాపకానికి వస్తున్నాయి. ఎన్నో సూత్రాలు గతించాయి. తన తాతతండ్రుల అధ్యాయంలో ప్రవేశించేటప్పటికి చటుక్కున గుండె ఆగింది. కళ్ళల్లో నీరు గిర్రున తిరిగింది. హృదయంలో మేఘాలు అలముకున్నాయి. కారు చీకట్లు క్రమ్ముకున్నాయి. సుడిగాలి ధుమారం రేగింది. సముద్రాలు గర్జించాయి. క్రాంతి సూచనలు కనుచూపు దూరంలో కనపడుతున్నాయి. శిల్పి విజయానందుడు కళ్ళు మూసుకున్నాడు, కాని హృదయాన్ని ఎలా మూసుకోగలడు ? ... తాతగారి బోధనలు మళ్ళి ఒక్కొక్కటే జ్ఞాపకానికి వస్తున్నాయి. తాత చెక్కిన నంది ఎదురుగా పరుగెత్తుకొని వచ్చి నిలబడింది. తండ్రియొక్క అర్థకృతి నటరాజ శిల్పంవైపు మళ్ళింది చూపు. శ్వాసనిశ్వాసలు తీవ్రంగా కొట్టుకుంటున్నాయి. ఇంతవరకు అగోచరమైన బాధ గోచరమైంది. హృదయం పదిలపడింది.

బక్కచిక్కి శల్యావశిష్టమైన శరీరానికి సంకల్ప భీమబలం చేకూరింది. అది వజ్ర సంకల్పం. శిల్పి విజయానందుని దృష్టిలో ఆకలి, బాధ, శరీరపటుత్వ హీనత, మటుమాయమైనాయి.

గంభీరత, నిశ్చలత, ఏకాగ్రత, కార్యదీక్ష శిల్పిని కదుములుగా అదుము కొన్నాయి. ఎటు చూచినా కళాప్రపంచం కన్నులముందు కట్టినట్టుగా కనపడు తోంది.

'చకచకా నడిచాడు. జగాలు కంపించాయ్' ఆ పద ధ్వనికి.

ఒక అవ్యక్త కళా స్వరూపం దారి చూపెడుతోంది, ఆ కళాపిపాస జీవికి.

పల్లెలు దాటి, నదులుగమించి శరవేగంతో పోతున్నాడు శిల్పి.

కనుచూపు మేరలో మిణుకు, మిణుకు మంటున్న అమరావతీకుడ్యాలు గోచరించినంతనే వడలు ఝల్లుమంది. నలువైపులు తేరిపార చూశాడు. అంతా తన చిరపరిచిత ప్రాంతాలే! బాల్యంనుండి తనకు పరిచితములైన పర్వత శిఖరాలే! అందులో మార్పేమీలేదు.

ప్రతిరేణువు శిల్పి హృదయాన్ని పరామర్శించి తియ్యని పలుకులతో స్వాగతమిస్తూ "ఎన్నాళ్ళకు తిరిగి వచ్చావ్ విజయా! మమ్ముల నందరిని విడిచి యిన్నినాళ్లు యెచ్చటికి పోయావ్? అటు చూడు! ఆ పర్వతాలు నీ రాకకై పరితపిస్తూ శిఖరాలు పైకెత్తి ఎలా ఎదురు తెన్నులుచూస్తున్నాయో చూశావా? చెట్లమీద పక్షులు కిలకిల రావాలు ఎట్లాచేస్తున్నాయో చూడు? మాతృభూమి నీస్పర్శవలన పులకితయైవనాలన్నిటిని ఎల్లా పుష్పింపజేసిందో చూడు? మమ్ములనీ నందర్ని విడిచి ఒంటరిగా ఎక్కడికో పోవడానికి నీ మనస్సు యెట్లాఒప్పింది? నీ వియోగానికి మేమంతా ఎంత కృంగిపోయామో తెలుసా"?

ఈ పరామర్శకి సిగ్గుపడ్డాడు, విజయానందుడు. కాళ్లు తడబడు తున్నాయ్. నెమ్మదిగా తన కుటీరం చేరాడు. ఏముంది అక్కడ? శిథిలావస్థలోయున్న జీర్ణకుటీరం. కృతజ్ఞతాపూర్వకంగా శిరస్సువంచి చేతులు మోడ్చి నమస్కరించి పర్వతారామాలవైపు మళ్లేడు విజయానందుడు.

తన వంశీయుల చేతులలో మెరుగులు దిద్దబడ్డ శిలాఖండాల్ని దర్శిస్తూ ద్వాదశారామంచేరాడు. నటరాజమూర్తి ముందు నతజానుడై నమస్కరించి తీవ్రదృష్టితో శిలాఖండాన్ని చూశాడు. మబ్బులు విడిన ప్రచండసూర్యునివలె గోచరించి శిల్పకళావ్యూహాసరళితకి మార్గమేర్పడుతున్నట్లు గోచరిస్తోంది శిల్పి చూపులకు.

ఏమి చేస్తున్నది? ఎట్లా చెక్కుచున్నది? ఏమీ గోచరించడంలేదు ఏదో మహాశక్తి తనని వశపర్చుకొని తానే యీ మహాకళారచన సాగిస్తున్నట్లు మనస్సులో భావనకలుగుతోందిగాని, దాన్ని వ్యాఖ్యానించలేనిస్థితిలోయుంది శిల్పి పరిస్థితి.

భూనభోనాంత రాళాల్ని పదఘట్టంతో ఊపివేయగల సన్నివేశాలు

వాటికవే విగ్రహంలో సృష్టించబడుతున్నాయి. దక్షపురిని దగ్ధంచేసిననాటి ముక్కంటికంటికొనలో యెరుపు చారలు వన్నె యింకా తగ్గనేలేదు. ప్రతి అవయవపు సొంపు భాషావాహినికి దూరమైపోతోంది... శిల్పం పూర్తిచేయ బడింది.

శిల్పి మేనిలో ప్రతిరక్తపు బొట్టు నటరాజ సేవలో మిళితమై శిల్పకళా సరస్వతికి అంకితమై పోయింది. పరికరాలు చేతి కొనవ్రేళ్ళనుండి మెల్లగా క్రిందికి జారాయి.

శిల్పి యెదుట పరమేశ్వరుడు, పరమేశ్వరుని యెదుట శిల్పి. ఒకరి నొకరు చూచుకున్నారు. పరామర్శించుకున్నారు.

"నేను నా కర్తవ్యాన్ని నెరవేర్చాను. నీలో నా కళా సరస్వతిని దర్శించుకునే భాగ్యంనాకు దక్కింది. ... కాని ప్రభూ! నా కింకేదైనా జన్మ వున్నట్లయితే, కళాజీవిగా మాత్రం సృష్టించకు. ... స్వార్థమయ ప్రపంచములో కళాపిపాసిగా పుట్టేకంటే ఘోర అపరాధం ఇంకొకటిలేదు. కళాకారునికి స్థానంలేని స్వార్థ జగత్తులో, కళాకారుడ్ని సృష్టించడం నీ సృష్టికే తీరని కళంకం" అంది శిల్పి హృదయం.

దీపం ఘుప్పుమంది. శిల్పి ప్రాణవాయువులు అనంతాకాశములో లీనమయ్యాయి. దిశలు ప్రతిధ్వనించాయి. సాగరుడు ఘూర్ణించాడు. తారాపథాన్నుండి తేజోదీప్తమైన నక్షత్రం రాలిపోయింది.



# నిరీక్షణ

అతడు ధనికకుటుంబములో పుట్టిన వ్యక్తేగాని, ధనదేవతావేశానికి లోనుకాని వ్యక్తిత్వం, అతనిలో కరుడుగట్టింది.

వలచి, వలపించుకున్నాడు ఒక నిరుపేదరాల్ని. వారి ప్రేమ కాచి, పూచి, పుష్పించింది. కొన్ని సంకీర్ణహృదయాలు అడ్డు నిలచాయి. వారి కలయిక చూడలేక కళ్ళల్లో శూలాలు గ్రుచ్చుకున్నాయి.

కలహమే కల్యాణంగా భావించే దురాచార పరుల కాకిగోల పడలేక, మతి చలించి ప్రేమికుడు పరదేశ గతుడైనాడు.

ఆమె ప్రేమరసాధి దేవత. ప్రియుడా, దేశాంతరగతుడు. అతని రాకకై క్షణమొకయుగంగా గడపింది. కేశాలు జడలు కట్టాయి. శరీరం శుష్కించింది. నిరీక్షణ ఫలితంగా కళ్లు కాయలుకాచాయి. ఎన్నో కృష్ణ, శుక్లపక్షాలు గతించాయి. ప్రియునిరాక ఆలస్యమైంది. కళ్ళు మూతలు పడ్డాయి. అదే అంత్యనిద్ర ఆ నిర్భాగ్యజీవికి.

"వెర్రెక్కి చచ్చింది, పదండి పారేద్దామంది లోకం............"
ప్రేతం స్మశానానికి చేర్చబడింది. ఎవరిత్రోవన వాళ్ళు పోయారు. క్షుద్ర జంతువులు కళేబరాన్ని కబళించేందుకై సమీపంగా చేరుకున్నాయి.

హృదయం చలించింది. అంతర్వాణిలో లీనమయ్యే కంఠముతో ఎలుగెత్తి ఏడ్చింది. కావలిస్తే శరీరాన్ని తినమంది. గుండెల్ని కండలు, కండలుగా చీల్చుకొని తినమని బ్రతిమాలింది. గాని— ప్రియునిరాకకై నిరీక్షించే యీ రెండు కళ్ళని మట్టుకు, ముట్టకుమని కష్టంతో మూల్గింది.

# విషాదజీవులు

అది శీర్ణ కుటీరము. ఏదో జీవి కదులుతూ వస్తోంది. ఆజానుబాహువు, తల ముంజూరుకు తగిలింది. తాటాకులు గలగలమన్నాయి, నడుం కళుక్కుమంది. వెంట్రుకలకు సంస్కారంలేదు. శరీరం ఎముకలగూడు. చేతిలో ఏవో ఘల్లుమంటున్నాయి. ముఖంలో నిరాశ తాండవిస్తోంది. నిశీథం; చంద్రుడు లేడు. చుక్కలే మిణుగురులలే మెరుస్తున్నాయి. దూరములో మందగమనముతో యెవరో పోతున్నారు. కొద్ది దూరములో కలయిక, ఆ వ్యక్తి వెనక్కి తిరిగేడు. కష్టంతో పెదిమలు మెదిపాడు.

" ఎవరు ? "

" నేనే "

" అంటే ? "

" నాట్యకారుణ్ణి "

" ఎక్కడకీ ప్రయాణం ? "

" శాంతికోసం "

" వయస్సు ? "

" ఎనభై "

" చాలా కాలం పోగొట్టుకున్నావు ? "

" అవును "

" ఎవరినైనా ప్రేమించావా ? "

" ఆ "

" ఎప్పుడు ? "

" బాల్యంలో "
" ఎవరిని ? "
" నాట్యాన్ని "
" ఆదరించిందా లోకం ? "
" లేదు. "
" పాపం. నిరాశ చెందావా ? "
" మరేం చెయ్యను ? "
" చిక్కి పోయావు ? "
" అవును. "
" కారణం ? "
" ఆకలి, అవమానం. "
" ఇల్లేది ? "
" అదిగో. "
" ఆ పడిపోయిన పాడుగోడల కుటీరమా ! ? "
" ఆఁ "
" వానకి ? "
" తడుస్తాను. "
" చలికి ? "
" తెల్లవార్లు మేలుకుంటా. "
" విసిగిపోయావు కదూ ? "
" అవును. "
" చేతిలో వేంటి ? "
" గజ్జెలు. "
" మెరుస్తున్నాయ్ ! "
" పరిశ్రమవలన. "
" ఇంకా నా ? "
" అవును. "
" ఎవరికోసం ? "
" నాకోసమే. "
" వదల్లేవా ? "
" అసాధ్యం "

" ఇంకా ప్రేమ పోలేదా... ? "
" ఎముకల్లో జీర్ణించింది, ఎలాపోతుంది..."
" నిశీథంలో బయలుదేరావు దేనికి ?"
" శాంతికోసమన్నాగా "
" ఏం చేస్తావు ? "
" గజ్జెలు పారేస్తా "
" నీవా ? "
" వాటితోనే "
" పాపం "
" మీ రెవరు ? "
" మీ సోదరుడ్నే "
" చేతిలో దేంటి ? "
" కలం "
" ఓహో ! నీవా ? "
" అవును "
" పరిశ్రమించావా ? "
" నీలాగే "
" మహారాజులు ఆదరించలేదా ? "
" చచ్చిపోయారు "
" గ్రంథాలు ? "
" చెదలు తిన్నాయ్ "
" ఎవరినైనా ఆశ్రయించకపోయావా ? "
" పొగుడుతూ వ్రాయమంటారు "
" వ్రాయలేకపోయావా ? "
" కలం పొగడదు."
" విమర్శించావా ? "
" లేదు, తప్పులు దిద్దిచూపేను "
" ఏమన్నారు ? "
" దుమ్మెత్తిపోశారు."
" కలాన్ని యేంచేస్తావు ? "
" నాలోనుండి వేరుచేస్తా "

" బ్రతుకగలవా ? "

" అసాధ్యం. "

" పద. "

" నడు. "

నడక సాగింది. అగాధ సముద్రం. ఒకరినొకరు చూసుకున్నారు, కన్నీళ్లు జలజల రాలి నీటిలో కలిసిపోయాయి.

మెరుపు మెరసింది. గజ్జెలు మెరిశాయి. ఒణకుతున్న చేతులతో ఆక్రందన హృదయంతో వ్రేళ్ల సందుల్లోనుండి గజ్జెలు జారి ఘల్లుమన్నాయి. నాట్యకారుని హృదయం ఝల్లుమంది.

కవి కలం విసరాలనుకున్నాడు, చేయి లేవలేదు. శక్తంతా కూడగట్టేడు. విషాదవదనంతో కలంవైపు చూశాడు. ఏళ్లైఏళ్ళ! సాంగత్యం కాని యేం చేయాలి? రెండు కళ్ళు మూసుకొని దూరంగా విసిరేడు.... ఇద్దరి కళా జీవుల కళ్ళు యింకొకమారు కలుసుకున్నాయి. కళ్లల్లో నీరులేదు. మోకాలుదాటింది నీరు. ఫెళ్లుమని విరుచుకుపడింది కెరటం.

తీరని కోరికలతో, ఆకలి, అవమానం సహిస్తూ దారిద్ర్యపు బ్రతుకు భారమైన రెండు కళాకేంద్రాలు సముద్ర గర్భంలో లీనమయ్యాయి.



# అనార్కలి

రాజ్యంలో కల్లోలాలు చెలరేగుతున్నాయి. కొండజాతులు విల్లంబులతో సామ్రాజ్య సైన్యాల్ని చిందరవందర చేస్తున్నాయి. వీటి పోట్లకు ఆగలేక వెన్ను చూపెట్టి పలాయన మంత్రం పఠించింది కాల్బలం. అటవికులు అల్పసంఖ్యాకులైనా, సంఘటిత శక్తితో భారత సామ్రాజ్యాధినేత అక్బరు పాదుషా సేనావాహినుల్ని పరాజయంలో ముంచెత్తేయని వార్తావహుని సందేశం చక్రవర్తి కందింది.

కళ్లల్లోనుండి అగ్నిగోళాలు వెలువడుతున్నాయి. ముఖం వివర్ణమైంది. మనస్సులో ఆవేదన, అవమానం... ఈ పరాజయం మొగలురాజవంశానికే తీరని కళంకం అన్నట్లు గాలికి రెపరెపలాడి క్రిందికి వాలింది పతాకం.

మహామంత్రుల్ని, సేనానుల్ని తక్షణం దర్బారుకు రమ్మని ఆజ్ఞ జారీ చేసాడు చక్రవర్తి. సామ్రాజ్యంలోయున్న సైన్యాలన్నిటిని కూడదీసి సేనలచే ఒక్కుమ్మడిగా దాడి చేయించి పర్వతలోయల్లోయున్న అటవికులనందర్ని రూపు మాపి, పల్లెల్ని మట్టంజేసి విజయనినాదాలతో తిరిగివచ్చేవరకు ఆహారం ముట్టనన్నాడు అక్బరు పాదుషా..........................................

కొండలోయల్లో యెటుచూచినా నేల యీనేటట్లుగా భూభాగాన్ని కప్పివేసింది పాదుషా సైన్యం. లోయల్లో లేళ్లను వేటాడుతున్నట్లు కొండజాతుల్ని వేటాడి మూలమట్టం చేస్తున్నాయి చక్రవర్తిదళాలు. శతఘ్నుల గర్జనలతో పర్వతకోనలు ప్రతిధ్వనిస్తున్నాయి. హాహాకారాలు మిన్నుముట్టాయి. ఆఖరుకి కొండజాతులు నాశనం చేయబడ్డాయి. రణఘోష ఆగింది. లోయల్లో ఇండ్లన్నీ పరశురామప్రీతి చేయబడుతున్నాయి. స్త్రీలంతా చెల్లాచెదరై తల్లిని పిల్లగానక,

పిల్లని తల్లి గానక ఎవరి ప్రాణాలు వారు గుప్పెట్లో పెట్టుకొని పారిపోతున్నారు.

.................................................................................................

అదిగో ఆ చెట్లమధ్య పొద కదులుతోంది జాగ్రత్తగా చూచిరండన్నాడు సైనికులతో దళాధిపతి.

నిరీష కుసుమ కోమలమైన శరీరం. స్వర్ణకిరణ కాంతుల్ని పరిహాసంజేసే ముఖకాంతి, కవ్వుల కిలాలకిందకి, చిత్రకారుని కుంచెకు లొంగని ఊహా మేఘాల కతీతమై అనంతాకాశములో లీనమైపోయే సౌందర్యమేదో ఆ విశాలమైన కనుకొలకులలో తారాడుతోంది. అపరిచితుల్ని చూసి లతల్లే చలించిపోయి భయంతో పొదమాటున వొదిగుంది పదేళ్ళ పసిబాలిక.

సైనికులు ఆశ్చర్యంతో వాళ్ళజీవితంలో సౌందర్యమంటే ఏమోయీనాడే చూడగలిగేరు. దళాధిపతి సమక్షంలో బాలిక నిలబెట్టబడింది. రెప్పవాల్చే మరచిపోయాడు దళాధిపతి. ఈ కిరణాన్ని సామ్రాట్టుకి బహూకరిద్దాం. జాగ్రత్తగా కాపాడండి అన్నాడు సైనికులతో.................

ప్రస్తుత రాజధాని లాహోరు. పట్టణ పరిసరప్రాంతాలు చేరుకున్నాయి సైన్యాలు. ఒకవంక విజయభేరీలు మ్రోగుతున్నాయి. కోట ముఖద్వారం మొదలు రాజసౌధాలవరకు చక్కగా అలంకరించారు. విజయవాహినులికి స్వాగతమిచ్చింది పురముఖ ద్వారం. అక్బరుపాదుషా నిండుదర్బారు కిటకిటలాడుతోంది మంత్రి సామంత సైనిక ప్రేక్షకులతో. సర్వసైన్యాధిపతి, ఆ చక్కనిచుక్కని వెంటబెట్టుకొని దర్బారులోప్రవేశించాడు. ఆ సౌందర్యం చూచి మంత్రముగ్ధమై పోయింది రాజసభ. మిలమిల మెరసే కనులతో అమాయకంగా నలువైపులు కలయజూచింది బాలిక. "ఎవరీ బాలిక?" అన్నాడు చిరునవ్వుతో గులాబీపూవు వాసనచూస్తూ సామ్రాట్టు అక్బరు.

కొండజాతిని నాశనంచేస్తూండగా ఒక మారుమూల పల్లెలో దొరికింది. దేవరవారికి బహూకరణార్థమై తీసుకొచ్చాము. అనుగ్రహించి కానుక స్వీకరించాలన్నాడు సర్వసైన్యాధిపతి.

"యీ అనార్కలీని సంతోషంతో స్వీకరించాము. ఈ బాలిక అంగసౌష్టవం నాట్యానికి అనుకూలంగా కనపడుతోంది. రాజనర్తనశాలలో విద్యాభ్యాసానికి పంపించి రాజసౌధంలోనే భద్రంగా కాపాడండి" అన్నాడు సామ్రాట్టు.................................................

రోజులు గతిస్తున్నాయి. ప్రసిద్ధ నృత్యకారుని పర్యవేక్షణతో నృత్యం

నేర్పబడుతోంది. నృత్య కళతోబాటు అనార్కలి శరీరతీరులు గూడా మారుతున్నాయి.

అయిదు వసంతాలు గడిచాయి.

“నౌరోజా” ఉత్సవాలు మహావైభవంగా చేయడానికి సన్నాహాలు జరుగుతున్నాయి. లాహోరుపట్నం ఇంద్రనగరాన్ని మరిపిస్తోంది. ఉత్సవాలు ప్రారంభమైనాయి. ఆ రోజు సామ్రాట్టు సముఖంలో అనార్కలి నృత్య ప్రదర్శనానికి అన్ని ఏర్పాట్లు దర్బారులో జరుగుతున్నాయి. దర్బారుకి పై అంతస్థులో అంతఃపుర కాంతలకై ప్రత్యేకమైన ఏర్పాట్లు చేశారు. అలంకరణ పూర్తి అయింది.

భారత సామ్రాట్టు వందిమాగధుల కైవారాలతో సభాభవనంలో ప్రవేశించి నలువైపుల కలయజూచి రత్నఖచిత సింహాసనాన్ని అధిష్టించాడు. మర్యాదసూచకంగా సభాసదులంతా ఒకసారి లేచి కూర్చున్నారు. సామ్రాట్టు సింహాసనానికి కుడిప్రక్కగా కూర్చున్న యువకుడే భావిభారత సామ్రాజ్యానికి అధినేత, యువరాజు సలీం. ఎడమ వైపు కొద్దిగా క్రింది భాగంలో మహామంత్రి, సామంతులు, మిత్రులు, నవరత్నాలు వారివారి ఉచిత ఆసనాలమీద ఆసీనులయ్యారు. జిగేలున ప్రేక్షకుల కళ్లు మెరిశాయి. అనార్కలి దర్బారులో ప్రవేశించింది.

సామ్రాట్టుకెదురుగా వినయంగా వంగి సలాం చేసింది. చిరునవ్వుతో స్వీకరించాడు సామ్రాట్టు.

నృత్య మారంభమైంది. నృత్య, గీత వాయిద్యములతో ప్రేక్షకులు ఉర్రూతలూగుతున్నారు. రసికాగ్రేసరులతో నిండియున్న కొలువును యథేచ్ఛగా ఏలుకొంటోంది ఆ నృత్యరాణి అనార్కలి.

భావభంగిమములో నిమీలిత నేత్రాలతో మోము పైకెత్తి పౌర్ణమి నాటి చంద్రదర్శనమల్లే కంటబడ్డాడు యువరాజు సలీం. ఆ తొలిచూపుల్లోనే మనస్సులు తొట్రుపడ్డాయి. హృదయాలు చిరునవ్వుతో......... అడుగాగింది. తాళం తప్పింది. ఇద్దరి శరీరాలు పులకరించి పలుకరించుకున్నాయి. మనస్సులు అల్లిబిల్లిగా అల్లుకున్నాయి. అపశబ్దం ధ్వనించేటప్పటికి భావనా ప్రపంచంలో విహరించే మనస్సులన్నీ మేలుకున్నాయి. మళ్ళీ ఎప్పటల్లే నృత్యమారంభమైంది.

క్షణకాలం దర్బారు ఎందుకు స్తంభించిందో సామ్రాట్టు గ్రహించాడు. సభ ఆ నాటికి ముగించబడింది.

కాలచక్రం భ్రమిస్తోంది. సలీం, అనార్కలి హృదయాలు చేదోడు వాదోడుగా వసంతోత్సవాలు చేసుకుంటున్నాయి. స్వప్న సామ్రాజ్యానికి ఏలికలై, మధుర యూహాలకు నాయకులై, నిర్వచనాతీతమైన దివ్యానుభవాల్ని సృష్టించుకుంటున్నారు. ఆ ప్రేమచకోరాలు.

సామ్రాట్టు మనస్సులో శాంతి శూన్యమైంది. కన్నులు మూసినా, తెరచినా, అనార్కలీ సలీములే గోచరిస్తున్నారు. వారి ప్రతి స్వరూపాల్ని మెదలో చిత్రించుకొంటున్నాడు అక్బరు పాదుషా. అతడు కాబోయే భావి భారత సామ్రాట్టు, పవిత్ర మొగల్ రాజవంశ సంజాతుడు యువరాజు సలీం...ఆమె పేరు ప్రఖ్యాతులులేని నాట్యకత్తె వీరి కలయిక సంభవమా? సంభవాసంభవాలతో కూడియున్న యీ క్లిష్టసమస్యా పరిష్కార విధానమెట్లు? ప్రేమకు ప్రాధాన్యమా? సంఘాచారానికి ప్రాధాన్యమా? చెవులేకాని కనులులేని న్యాయశాసనము దీని నేవిధంగా పరిష్కరిస్తుంది? నేనైనా యీ కిరీటానికి బానిసనేకదా! నేను మాత్రం యేం చేయగలను. సలీంయొక్క తండ్రిగా యీ పవిత్ర ప్రేమను మనస్ఫూర్తిగా అంగీకరించగలను. గాని, భావి సామ్రాట్టు యువరాజు సలీం ప్రేమను, సామ్రాజ్యాధినేత సామ్రాట్టు అక్బరుగా మాత్రం అంగీకరించడం. నా శక్తికిమించినపని. ప్రపంచం నా యుద్దేశాల్ని మన్నించేస్థితిలోలేదు. ఏ నాటికైనా చైతన్యం కలిగి మంచిచెడ్డ లాలోచించి న్యాయం తీర్పుచెప్పగలదనే ఆశమట్టుకు నాకుంది. ఆ నాడు అక్బరుహృదయం ప్రపంచానికి తెలుస్తుంది. నా కోర్కెగూడా అదే. ఎంతవరకైతే ప్రజల్లో చైతన్యం కలుగదో ఎంతవరకైతే వారి మేధస్సు నూతన తేజంపొందదో ఆ నాటివరకు బానిసత్వం, తప్పదు.

నాయనా! సలీం, నన్ను క్షమించు. నేను పరోక్షంగా సామ్రాట్టుని. నీ హృదయం నాకు తెలుసును. యీ కిరీటమేగాని నా శిరస్సుమీద లేనట్లయితే మీ ప్రేమైక జీవుల కలయికకు అఖండ స్వాగత మిచ్చేవాణ్ణి. గాని యేం చెయ్యను. అంధప్రపంచానికి అంధుడనై త్రోవచూపెట్టేందుకు ప్రధాన్యత వహించే చిహ్నం యీ కిరీటం ధరించాను. ఒకనాడు భారతదేశ ఆత్మలు మిమ్ముల నర్థం చేసుకోగలవు. ఆనాడే మీ దివ్యస్మృతులు అవారి హృదయాల్లో ప్రవహించగలవు. మీ నిర్మలప్రేమకు నమస్కృతులు. నా విధి నన్ను

నెరవేర్చుటకు అనుమతించమని హృదయంతో ఆక్రందించాడు సామ్రాట్టు అక్బరు.

మిత్రులు, శ్రేయోభిలాషులు, సలీం, అనార్కలీ ప్రేమను సమర్థిస్తూ ఆడిన పలుకులు ములుకులై అక్బరు హృదయాన్ని తూట్లుతూట్లుగా చేస్తున్నాయిగాని బయటకు బహిర్గతం కానీయడంలేదు. అక్బరు స్వాభావికంగానే గంభీరుడు. కఠినాతికఠినమైన యీ పరిస్థితిలో మరీ గంభీరుడైనాడు. ఎవ్వరికి యేమీ తెలియుటలేదు. దీనికి పర్యవసానంగా యేదో సాకుమూద సలీం దూరదేశ మంపబడినాడు.

ప్రేమమూర్తి అనార్కలి న్యాయ శాస్త్రానుకూలంగా విచారింపబడింది. అన్యాయశాస్త్రం న్యాయశాస్త్రం పేరుతో మృత్యురూపమై సహస్రనాలుకలతో అనార్కలిని బలి గొనేందుకై ఎదురుచూస్తోంది. న్యాయ శాస్త్రప్రకారంగా తీర్పు చెప్పబడింది. "భావి సామ్రాట్టు యువరాజును ఒక నాట్యకత్తె వశపర్చుకొనుటకు ప్రయత్నించుట; దేశానికి, రాజవంశానికి, ప్రజాక్షేమానికి ఘోరాపరాధం చేసినట్లుగా భావించబడింది కనుక "దోషికి బలవన్మరణం" శిక్షగా విధించబడింది" అని తీర్పుచెప్పింది న్యాయస్థానం"...

..................................................................

అదివధ్యస్థానం.

రాతిగోడల నడుమ అనార్కలీ నిలువబెట్టబడింది. గోడ కట్టబడుతోంది......అనుభవించు నీ ఖర్మఫలం, అందిలోకం.........అర్ధరాత్రి కడుపులో నిద్రపోతున్న నిశ్శబ్దం, అగ్ని పర్వత గర్భంలో కళ వెళధ్వనులతో పర్వతశిఖర ముఖాన్నుండి తొంగిచూసే బడభాగ్ని, కొండకు ఢీకొని ఓడి పోయి వెనుకడుగువేసే సముద్ర కెరటంలో పరాజయ విషాదగానం, కారడివిలో చెట్టుకు వ్రేలాడదీయబడ్డ బ్రతుకాశలేని అపరాధ హృదయంలో నిట్టూర్పు, నిరాశాజీవితంలో నిస్త్రాణ. కలసి మెలసి బోబూచు లాడుకొంటున్నాయి అనార్కలీ హృదయంలో...దురాచార కరాళ రాక్షసి. ఒక ప్రేమ జీవిని తన పాషాణ గర్భకుహరంలో బంధించుకుంది.



# మాతృశ్రీ

(దీనిని సుప్రసిద్ధ కవిశేఖరుడు జేచనశర్మ. "ఉగ్ర" రచించాడు.

మాతృదేశ దాస్య విముక్తికోసం భారతీయ యువకులు తమ ప్రాణాల్ని ఎల్లా తృణప్రాయంగా భావించి అర్పించారో — దేశమందున్న వారి గాఢానురాగం వారి నెటువంటి కార్యములకై పురికొల్పుతుందో — ఇందులో చక్కగా చిత్రించాడు.

ఈ కథను హిందీనుండి పరివర్తన చేయడంలో ఏవైనా దోసగులున్న పక్షంలో అవి నాలోపాలే గాని మూలరచనా లోపంకాదని మనవిచేస్తున్నాను వీలైనంతవరకు మూలన్నే అనుకరించడానికి ప్రయత్నించాను. తప్పులు దొరలినయెడల క్షమించ ప్రార్థన.)

—రచయిత.

# మాతృశ్రీ

మధ్యాహ్నం కొంచంసేపు పడుకొనిలేచాను. సిగరెట్టువెలిగించి నెమ్మదిగా చదువుకునే గదిలోనికి వెళ్ళాను. పెద్దపెద్ద బీరువాల్లో వరుసగా పేర్చబడిన పుస్తకాలవైపు మళ్ళింది నా చూపు. ప్రసిద్ధ కవి వ్రాసిన గ్రంథం కోసం వెతుకుతున్నాను. గాని బీరువాలో యీ చివరినుండి ఆ చివరవరకు ప్రసిద్ధ పురుషులు వ్రాసిన గ్రంథాలే కనపడుతున్నాయి. గోటే, రూసే, మేజినీ, నిటుశే, షేక్స్పియర్, టాల్‌స్టాయ్, మపాసా, డికిన్సు, స్పెన్సరు, సొకాతే, మిల్టను, మోలియరు. ఉఫ్! ఈ దరినుండి ఆ దరివరకు ఒకదాన్ని మించింది ఇంకొకటి. అన్నీ ప్రసిద్ధ గ్రంథాలే! ఎంతసేపు ఆలోచించినా ఒక నిశ్చయానికి రాలేకపోయాను. మహాపురుషుల పేర్లు చదువుతూ చదువుతూ విసిగిపోయాను.

ఇంతలోనే బయటినుండి 'భా, భా' మని శబ్దం వినిపించింది. కిటికీలోనుండి చూచేసరికి బూడిదరంగు కారు కనపడింది. ఎవరో మిత్రులు దయచేశారనుకొన్నాను. మనస్సులోమట్టుకు సంతోషపడ్డాను 'యీ మహాపురుషులతో గొడవ వదలిందిగదా!' అని.

నౌకరు వచ్చి సలాంచేసి పరిచయపత్రం యెప్పుడైతే యిచ్చాడో అది చూచి గాబరాపడ్డాను. దానిమీద పట్టణ పోలీసు సూపరెంటెంటు పేరుంది. 'సమయంగాని సమయంలో యీయన ఎందుకు దయచేశాడా?' అనుకున్నాను.

పోలీసు అధికారి లోపల ప్రవేశించాడు. నేను కరచాలనంచేసి తిరుగుడు కుర్చీమీద కూర్చోమన్నాను. ఆయన వ్యాపారరీత్యా ఒక చిన్న నవ్వునవ్వి అన్నాడు:

"సమయంగాని సమయంలో వచ్చినందుకు నన్ను మీరు క్షమించాలి"

"ఆజ్ఞ యివ్వండి" నేనుకూడా నమ్రతతో అన్నాను.

ఆయన జేబులోనుండి దినచర్య పుస్తకంతీసి, అందులోనుండి చిత్రం నాకుచూపెడుతూ "చూడండి దీనిని. యీతడు మీకు తెలుసుననుకుంటాను."

"హాఁ తెలుసును. కొంచం జంకుతూ అన్నాను."

"ఇతని గురించి మీతో కొంచం మాట్లాడాలి"

"అడగండి"

"ఇతని పేరేమి ?"

"'లాల్'. నేను యీ పేరుతోనే చిన్నప్పటినుండి పిలుస్తూవస్తున్నాను. అయినా ఇది పిలిచేపేరు మాత్రమే. ఇంకొక పేరు ఏదోవుంది. నాకు ఈ సమయంలో జ్ఞాపకం రావడంలేదు."

"ఇతని నివాస మెక్కడ ?" పోలీసు సూపరెంటెండెంటు అదొకవిధంగా నా కేసిచూస్తూ అడిగాడు.

"నా బంగళాకి ఎదురుగా ఆ కనబడే రెండంతస్తుల మేడలోనే అతను, అతని ముసలి తల్లి వుంటారు."

"ఆమె పేరేమి ?"

"జానకమ్మ."

"ఇతని పరివారంలో ఇంకెవ్వరులేరా ? ఈ ఇద్దర్ని పోషించేదెవరు ?"

"ఏడు-ఎనిమిది సంవత్సరాలు అవుతుం దనుకొంటాను 'లాల్' తండ్రి స్వర్గస్థుడయ్యాడు. ప్రస్తుతం వాళ్ళ పరివారంలో మిగిలిందల్లా ఆ ఇద్దరే. లాల్ తండ్రి బ్రతికున్నంతకాలము నా జమీకి మానేజరుగాయుండేవాడు. ఆయన పేరు 'రామనాథ్'. అతడు కొంత డబ్బు నా దగ్గర జాగ్రత్తచేశాడు. దానిమీదే ఇంతవరకు వాళ్ళ కుటుంబపోషణజరిగింది. లాల్ కాలేజీలో చదువుతున్నాడు. అయినా ఒకమాట అడుగదలచుకొన్నాను క్షమించాలి. తమరు అతనిని గురించి ఇంత వివరంగా ఎందుకడుగుతున్నారో కొంచెం తెలుసుకోవచ్చునా ?"

"ఈ విషయాలు, వీటి వివరాలు మీతో నేను ఎక్కువగా చెప్పలేను. కాని మీరు ఇది మాత్రం సర్కారు పని అని తెలుసుకోవాలి. ఇందుకోరకై యీవేళ మీకు నేను యింత కష్ట మీయవలసివచ్చింది."

"అబ్బే! యిందులో కష్ట మేముంది? అంగులో మేము ఏడు తరాల నుండి సర్కారు బంటులం. ఇంకా ఏమయినా ఆజ్ఞ వుంటే..."

"ఇంకొక మాటుంది." పోలీసు అధికారి గంభీరభావంతో నెమ్మదిగా అన్నాడు: "నేను మీకు మిత్రుడుగా ఒక మాట చెప్పదలుచుకున్నాను. మీరు యీ పరివారంతో వీలైనంత దూరంగావుండటం మంచిది. ఇంతకంటే ఎక్కువ మీకు నేను చెప్పవలసింది యేమీలేదు."

## 2

లాల్ తల్లి జానకమ్మను ఒకనాడు పిలిచి అడిగాను: "లాల్ యీమధ్య ఏంచేస్తున్నాడు? మీరు అతనిని చాలా ప్రేమిస్తారుకదూ?"

"ఏంబాబూ?" అంది జానకమ్మ. "వా డేమీ చేయడంలేదే! వాడు తప్పు పని చేస్తుండగా నే నెప్పుడూ చూడలేదుకూడా?"

"ఏమీ చేయకుండా సర్కారు ఎవరివెనుకా పడదు. హాఁ జానకమ్మ గారూ! యీ ప్రభుత్వం అనవసరంగా ఎవ్వరికి అన్యాయంచెయ్యదు. తప్పక నీ కొడుకు యేకో చేసివుండాలి."

"అమ్మా! అమ్మా!" అంటూ అదేసమయంలో లాల్ కూడా వచ్చాడు. దీర్ఘమైన, సుందరమైన శరీరం, మంచి ముఖవర్చస్సు.

"అమ్మా!" అంటూ నాకేసిచూసి నమస్కారంచేసి, జానకమ్మతో అన్నాడు: "నీవు ఇచ్చటికి పరుగెత్తుకొని వచ్చావా? పదవే అమ్మా! నాతో చదువుకుంటున్న మిత్రులంతా అక్కడ వున్నారు. వాళ్లకి తినడానికి ఏదైనా తొందరగా చేసిపెట్టు. మే మంతా తొందరగా షికారుకి పోవాలి.

అప్పటికే జానకమ్మ ముఖం వివర్ణమైంది. శరీరం వణుకుతుంది. "అరే! లాల్ వచ్చావా నాయనా? పద వస్తున్నాను. కాని చూడునాయనా మీ బాబాయి నిన్ను గురించి ఏమో అంటున్నారు నీవు ఏదో తప్పుడుపనులు చేస్తున్నట్లు తెలిసిందట, నీవు అట్లా చేస్తున్నావా? నాయనా"

"ఏమిటిబాబాయ్, నేను ఏం తప్పుచేశాను? లాల్ సవినయంగా శాంతస్వరంతో అన్నాడు."

"లాల్, నీమీద నాకు చాలా కోపంగావుంది" గంభీరంగా అన్నాను

"ఎందుకుబాబాయ్ నేనేంచేశానని" అన్నాడు లాల్.

"నీవు చెడ్డవాడవై పోతున్నావు. సర్కారుని కూలద్రోసే వాళ్ళతో వుంటున్నావుకదూ! హాఁ హాఁ అవును. చూడండి! జానకమ్మగారూ ఆ ముఖంకేసి కాస్త చూడండి. ఎలా తెల్లబడిపోయిందో నీకు ఆశ్చర్యంగా ఉండొచ్చును. యీ సమాచారం నాకెట్లా తెలిసిందని, అవునా? లాల్.

నా మాటలు వింటుండగానే నవ్వుతుండే లాల్ ముఖం కాస్తా నల్ల బడింది కాని వెంటనే సర్దుకున్నాడు.

"మీరు పొరపాటున వినుంటారుబాబాయ్! నే నే విద్రోహసంఘంలో లేను. హాఁ నా ఆలోచనలు స్వతంత్రంగా మట్టుకు వుంటాయి. దానికి నేను ఒప్పుకుంటాను. నేను అప్పుడప్పుడు అవసర, అనవసర సమయాల్లో ఉద్రేకం పొందుతుంటాను. దేశంయొక్క దురవస్థగురించే విచారిస్తూ ఉంటాను. ఉద్రేకం పొందుతుంటాను. ఈపరహృదయ పరతంత్రంఅంటే నాకుచాలాఅసహ్యం.

"సరే అలాగే నీవన్నట్లు విద్రోహకరచర్యల్లో లేవనుకుందాం. యీ అనవసర ప్రసంగమంతాయెందుకు? దీనివల్లలాభం ఏముంది? నీ ఈ అనవసర వుద్రేకంవల్ల దేశంయొక్కదుర్దశ గాని, పరాధీనతగాని దూరమౌతుందని అనుకో వద్దు. నీపని చదవడం కాబట్టి సరిగాచదువు. దీనితరువాత ఏదైనా కర్మ చేయ వలసియుంటుంది. దాని తర్వాత నీ దేశంయొక్క మర్యాద కాపాడవలసి యుంటుంది. అన్నిటికంటె ముందు నీయింటిని నీవు చక్కబెట్టుకోవడానికి ప్రయత్నించు. తరువాత సర్కారుని సరిచేద్దువులే."

"బాబాయ్! నన్ను క్షమించండి. యీ విషయంలో మీతో నేను వాదంచేయను" అని లాల్ వినయంగా అన్నాడు.

"చెయ్యాలి; ఎందుకుచేయకూడదు? వివాదం చేయవలసేయుంటుంది నేను నీకు కేవలం బాబాయినేకాదు, నీ పురోభివృద్ధి నీ క్షేమం కోరడంలో నాకూ చాలా అధికారంవుందని తెలుసుకో. నీకేంతెలుస్తుంది? నిన్ను చూడ గానే నీతండ్రి రామనాధ్ నాయెదుట నిలబడతాడు. నీ ముసలితల్లి నాకళ్ళకి కనపడుతూవుంటుంది. ఇంతకీ నీవు చెడుత్రోవలో పోతుంటే నేను చూస్తూ వూరుకుండాలిసిందే? అట్లా ఏనాటికీ సాగదు, ఆనమ్మకం నీవుపెట్టుకోకు.

బాబాయ్! ఈపరాధీనత వివాదంలో మీమార్గంవేరు, నామార్గంవేరు. మన అభిప్రాయాలు వేరువేరు మార్గాలలో ఉన్నాయి. మీరు స్వచ్ఛమైన

రాజభక్తులు. నేను స్వచ్ఛమైన రాజవిద్రోహిని. మీరు మీ కారణాలవల్ల మీ మార్గమే ఉచితమనుకొంటారు. నేను ఇంకా కొన్ని కారణాలువల్ల నామార్గం ఉచితమైందని అనుకొంటున్నాను. మీకు ప్రియమైన కల్పనలకోసం మీరు మీ మార్గాన్ని విడిచిపెట్టలేరు. నేను నా మార్గాన్ని గూడా తప్పలేను."

"నీ వుద్దేశాలు, మీ కల్పనలు ఏమో నాకుకూడాచెప్పావింటాను. నేనూ వినాలనే అనుకుంటున్నాను. యువకులు కాలేజీ చదువులు వంటపడుతూ పడుతూ వుండగానే వాళ్ళ తలల్లో యెలాంటి గాలులు ప్రవేశిస్తుంటాయో, యేమేమిస్వప్నాలు కంటూంటాగో వినదలుచుకున్నాను. వినిపించు నాయనా! కొంచం వినిపించు."

(లాల్ గంభీరంగా అన్నాడు) "ఏ వ్యక్తిఅయితే తన సమాజం లేక రాష్ట్రింకోసం, ఇంకొక వ్యక్తియొక్క సమాజాన్ని, రాష్ట్రాన్ని నాశనంచేసి బ్రతుకదలచుకున్నాడో అటువంటి వ్యక్తి సర్వనాశనమైపోవడమే నాకు కావలసింది. ఇదే నా ఆశయం.

జానకి లేచి వెళ్ళబోతూ— "అరే లాల్! బాబాయితో దెబ్బలాటికి తయారౌతున్నావే! పాపం! ఆ నలుగురు పిల్లలు దర్వాజాముందే నిలబడి పోయారనుకుంటాను. నీవు యిలాగే దెబ్బలాడుతూ వుండు. నేను వెళ్తాను." అంటూ నాకేసిచూసి "వాడికి బాగా నచ్చచెప్పండి బాబూ! నేనేమంటానో నాకే తెలియదు. వాడికేమి చెప్పగలను?" అని లాల్ కేసి చూసి "బాబాయ్ యేది చెప్పితే అది జాగ్రత్తగా విను నాయనా! ఆయన నీ మంచికోసమే ఏదైనా చెప్తాతారు"

అమాయకురాలు మా ఇద్దరి సంభాషణల్లోయున్న గంభీరత ఆమె కేమి తెలుస్తుంది? తలమీద ముసుగు సరిచేసుకుంటూ వృద్ధాప్య చిహ్నంగా వంగిన నడుంమీద చెయివేసుకొని నెమ్మదిగా వెళ్ళిపోయింది.

లాల్ ఉత్తేజితమైన స్వరంతో "అలాంటి దుష్టవ్యక్తుల్ని, వారి సంఘాల్ని రూపుమాపడంలో నా చెయ్యిగూడా ఉండే తీరుతుంది."

"లాల్ నీ చేతిలో నీ వనుకున్నంత బలములేదు. మేలుకొనిఉండే స్వప్నాలు కంటున్నావు. నీ కల్పనలన్నీ నిరాధారమై నాశనమైపోగలవు. బాగా ఆలోచించు"

"బాబాయ్! నష్ట మనేది యిచ్చటి నియమాల్లో ఒకటి. దేనినైతే మనం సరిచేయదలచుకున్నామో దాన్ని కొంత పాడుచేయవలసే యుంటుంది.

మనం దుర్బలంగా యున్నామని చేయబోయే కార్యాల్ని నిలబెట్టకూడదు. అవసరంపడినప్పుడు మా భుజాల్లో బలం లేకపోదూ వెలితిపడదు. న్యాయం యేనాటికైనా జయించితీరుతుంది. ఇది నా విశ్వాసం."

"ఇంతకీ నీవు యేమి చెయ్యదలచుకున్నావు ?"

"నావల్ల యెంతౌతుందో అంతా చేస్తాను. దేశ క్షేమంకోసం."

"మోసమా ?"

"అవసరమని తోస్తే, తప్పకుండా..."

"విద్రోహం......?"

"హాఁ, అవశ్యం......"

"హత్య ?"

"హాఁ, హాఁ, హాఁ."

"నాయనా ఏ పుస్తకాలు చదివినందువలన నీ మనస్సు యీవిధంగా మారిందో ? జాగ్రత్తసుమా !"

# 3

నాభార్యా, లాల్ తల్లి జానకమ్మ ఒకరోజున కలసి మాట్లాడుకుంటూండగా నేను యింట్లో ప్రవేశించాను. కొద్దిరోజులనుండి ఒకవిషయం ఆమెనడిగి తెలుసుకుందా మనుకుంటున్నాను. కాని కలుసుకోలేకపోయాను.

"ఏమండీ జానకమ్మగారూ ! లాల్ స్నేహితులు ఎంతమంది మీ ఇంటికి వస్తుంటారు ?" అని అడిగాను.

ఆమె (వినయంగా) "నాకేం తెలుస్తుందిబాబూ ! అయినా వాళ్ళు గూడా నా లాల్ కిమల్లే ఎంతో ముద్దుగా ఉంటారు. అందరూ ఉత్సాహవంతులు వాళ్ళ నవ్వులకీ, పాటలకీ, వాళ్ళుచేసే అల్లరి హంగామాకి హద్దూపద్దూవుండదు. వాళ్ళచిలిపిచేష్టలు చూస్తూంటే నాకెంతో సంతోషమేస్తుంది"

నేనొక బరువైన నిట్టూర్పువిడిచాను. "హుఁ నిజంచెబుతున్నావు. వాళ్లు యే విషయాలు మాట్లాడుతుంటారు ? మీకేమైనా తెలుసునా ?"

"బాబూ వాళ్ళు లాల్ సహితంగా కూర్చుంటారు. నేనెప్పుడైనా వాళ్ళకి తినడానికి ఏమైనాఫలహారాలు తీసుకెళ్ళేటప్పుడు వాళ్ళంతా నన్ను

అమ్మా, అమ్మా అని పిలుస్తాడు. ఆమాట నా చెవులకు అమృత వాక్కులా ఉంటుంది. వాళ్ళంతా నా సంతానమనిపిస్తుంది. మీరునమ్మండి బాబూ నామాట"

"హూఁ..." అన్నీ నేను బరువైన శ్వాస పీల్చుకున్నాను.

"అందులో ఒకపిల్లవాడు వాళ్ళందరికంటే ఎక్కువగా నవ్విస్తుంటాడు మంచి బలవంతుడు, ఆరోగ్యవంతుడుగూడాను. లాల్ అంటూవుంటాడు- అతడు దెబ్బలాటలో, పరిగెత్తడంలో, పిడిగుద్దులలో, తిండిలో, ఉడికించ డంలో, హేళనచేయడంలో, అల్లరిచేయడంలో కాలేజీలో ప్రథముడట! ఆపిల్లవాడే ఒకనాడు నేను పాల్పోస్తుండగా నా ముఖంకేసి చూసి- 'అమ్మా! నీవు నాకు నిజంగా భారతమాతల్లే కనపడతావు. నీవు ముసలిదానవు, ఆమెగూడాముసలిదే. ఆమెశిరస్సుమీద హిమాలయపర్వతం తెల్లగా మెరుస్తూ ఉంటుంది. నీతలమీద యీ వెంట్రుకలు అలాగే మెరుస్తున్నాయి. ఉండు నేను సరిగా ఆ చిత్రపటాన్నే చూపెడతాను. చూడు! నీవు భరతమాతవు. నీ శిరస్సు హిమాలయం, నీ లలాటంమీద ఆ పొడవైన రెండు రేఖలే గంగా, యమునానదులు. ఈ ముక్కు వింధ్యాచలం, యీ గడ్డం కన్యాకుమారి. ఇదిగో ఈ శరీరంమీద పెద్దపెద్ద ముడతరేఖలే వివిధ పర్వతాలు, నదులు. అమ్మా! ఇటు కొంచెంరా! నీకేశాల వెనుకనుండి ముందుకు నీ భుజాలమీదుగా నా చేయి ఊపుతాను దానితో అది బర్మా అయిపోతుంది. బర్మాలేని భారతదేశం పూర్ణమనిపించుకోదు, భారతదేశ శృంగారం బర్మాతోనేయుంది."

జానకమ్మ ఆ పిల్లవాడి మాటలు చెపుతూ ఆనంద బాష్పాలు రాల్చింది. "బాబూ! ఆ పిల్లవాడు ఎంత కొంటెపిల్లవాడో చెప్పలేను. పిల్లలంతా ఆనందం పట్టలేక నవ్వుతూ ఉండగానే అతడు నన్ను పట్టుకొని, నా జుట్టును విప్పి అతటి బర్మాను తయారుచేసుకున్నాడు.— 'అమ్మా! ఇటు చూడు. నీ కుడి చెవి 'కచ్ఛ్ ఖాతము'— బొంబాయికి ముందుగా ఉంటుంది. ఈ యెడమవైపు బంగాళాఖాతము. అమ్మా! నీ ముఖం తిన్నగా పెట్టి నుంచో. నేను నీ పాదా లకు దగ్గరిగా రెండు అంగుళాల దూరంలో చేతులు జోడించి, బొటన వ్రేళ్ళ మీద కూర్చుంటాను. గెడ్డం నీది కన్యాకుమారి హాఁ హాఁ హాఁ హాఁ — ఇదిగో కొద్దిగా వంగిన నా భంగిమమే సిలోన్ (లంక) హాఁహాఁహాఁహాఁ— బోలో భారత మాతాకు జై!' అంటూ పిల్లలంతా నవ్వటం ప్రారంభించారు. అతడు మోకాళ్లు మీద కూర్చొని చేతులు జోడించి నా పాదాల దగ్గరగా కూర్చుండిపోయాడు. విపరీతంగా నవ్వుతున్న ఆ పిల్లలకేసి చూస్తూ నేనూ అట్లాగే నిలబడిపోయాను.

"బాబూ! వాళ్ళంతా నా కష్టాలే! అందరు నన్ను 'అమ్మా! అమ్మా!' అని పిలచి పొడుతూ ఉంటారు" అంటూండగానే ఆమె నేత్రాలు మిలమిల మెరశాయి.

ఆమె సరళ సంభాషణ నా కనుకొలకుల్లో నీరు నింపింది. నా నేత్రాలు అశ్రుపూరితాలైనాయి. నేను అడిగాను: జానకమ్మగారూ! వాళ్లు యింకే మయినా మాట్లాడుతుంటారా? దెబ్బలాటలను గురించిగాని, తుపాకుల్ని గురించిగాని, తుపాకు గుళ్ల గురించిగాని ఎప్పుడైనా మాట్లాడారా?"

(ఆమె నవ్వుతూ అంది) "అయ్యో బాబూ! మాట్లాడుకుంటూ ఉంటారు. వాళ్ల మాటల్లో సారం ఏమీ ఉండదు. అందరు యువకులు, మంచి ఉత్సాహవంతులు, ఎవ్వరికీ భయపడరు, ఆఖరుకి భయమంటే ఏమో వాళ్ళకి తెలియదు. నోటికి ఏదివస్తే అది మాట్లాడేస్తారు. అప్పుడప్పుడు పిచ్చివాళ్లలా మాట్లాడుకొంటారు. షుమారొక నెల అవుతుందనుకొంటాను. ఒకనాడు పిల్ల లంతా ఎంతో ఉత్తేజితులుగా కనబడ్డారు. అంతా ఒకదగ్గర కూర్చొని ఏదో ఆలోచించుకుంటున్నారు. నాకు అప్పుడప్పుడు వాళ్ళ పిచ్చిమాటలు వినాలని ఉండి దర్వాజా ప్రక్కగా నుంచొని విన్నాను.

వాళ్లేం మాట్లాడుతున్నారోగాని మధ్య మధ్య అస్పష్టంగా కొన్ని మాటలుమాత్రం వినబడుతున్నాయి. ఎక్కడో ప్రభుత్వం యెవరినో పట్టుకో బోతుందో లేక పట్టుకున్నారో యేమోగాని వాళ్ళల్లో వాళ్లు కలబిలబడుతూ అంటున్నారు. — పోలీసులు సందేహంతో పెద్దమనుష్యుల్ని, పిల్లల్ని కొట్టి, హింసించి, నానాబాధలు పెడతారు. ఈ అత్యాచారులు పోలీసులలో యున్న నీచగుణమే యిది. ఇలాంటి నీచమైన శాసన ప్రణాళిని మనం ఒప్పు కోవడం, లొంబడడం, మన ధర్మానికి, కర్మానికి, ఆత్మకి అపచారంచేయడమే. — నెమ్మది నెమ్మదిగా కడిగివేయాలి, నాశనం చెయ్యాలి!

మొదటివాడు ఉత్తేజితుడై అన్నాడు: "అవునయ్యా! ఈ పరదేశస్థులు మనకే మాతారు మోకాళ్ళు భూమికి మోపించి మ్రొక్కించుకోడానికి? మనని వాళ్ళ రాజుకి భక్తులుగా చేయించి బానిసలుగా బ్రతుకమనడానికి. మన వక్షస్థలాలమీద వాళ్ళ ఫిరంగుల ముఖాలు పెట్టి మనని జడిపించడానికి. ఉఫ్! మనదేశస్థుల కళ్ళల్లో నిజమైన చూపు పోయింది. అందువల్లనే యిలాంటి అపచారాలు జరుగుతున్నాయి. మనిషి మనిషికి జడుస్తున్నాడు.

రెండోవాడన్నాడు— "ప్రజలలో ఇంకా చైతన్యరాలేదు ఇందువలన

మనం చదివే వ్రాసే సాధనాల్ని అజ్ఞాతంలో వుంచారు. ప్రజలు వీరులుగా అవటానికి అవకాశం దొరకటంలేదు. ఇందువలనే అవమానకరమైన మనుష్య నీతిని నాశనంచేసే శాసనాలు తయారయ్యాయి. ఈప్రభుత్వం పేదలరక్తాన్ని పీల్చి, సేన పేరుతో వాళ్ళను తప్పత్రాగించి, నానామాంసాలు మేపి, మన్న పోతులల్లే తయారు చేసుకొంటారు. అవసరమైనప్పుడు ప్రజల్ని అణచేందుకు. నెమ్మది నెమ్మదిగా యీ కుటిలనీతి ప్రణాళి మన దేశంయొక్క ధర్మాన్ని, ప్రాణాల్ని, ధనాన్ని పీల్చుతూపోతుంది. దీనిని పతనం చేసిననాడుగాని మనకు ముక్తిలేదు."

మూడవవ్యక్తి బొంగడా అన్నాడు—"నా వుద్దేశ్యంలో అన్నిటికంటే చెడ్డది ప్రభుత్వానికి మూలాధారమైనది ఏభైఏడవ చట్టం డాంభికంగా, క్రూరంగా, అన్యాయంగా, మనమీద శాసనం చేస్తోంది. అది కళ్ళుతెరచీ తెరవడంతో మనలను రాసి, రంపాన పెట్టడానికి, మనమీద నల్లటిముసుగులు కప్పటానికి, మనం దేశద్రోహులం అన్నట్లుగా ప్రపంచంముందు చూపెట్ట డానికి, మనల్ని హతవీర్యులుగా చేయడానికి ప్రయత్నిస్తుంది. ఇది ఎందువల్ల జరుగుతుందో జాగ్రత్తగా ఆలోచించండి. వ్రేళ్ళమీద లెక్క పెట్టవలసిన ధన వంతుల, కుభేరత్వాన్ని చిరకాలం జీవింపచేసుకొనేందుకు, వాళ్ళ భోగాల కోసం ప్రపంచంలోయున్న మానవకోటినందర్ని నాశనంచేసి మట్టిలో వూడ్చు తున్నారు. భగవంతుడిచ్చిన జన్మ హక్కైన స్వతంత్రతని వీళ్ళ భోగాల కోసం నాశనం చేసుకోవలసిందేనా? ఛీ, యీ స్వార్థుల నాశనం మన కళ్ళారా చూడనిదే నిద్రపోకూడదు.

"ఇలాగే లేనిదొకమాట ఉన్నదొకమాట కూస్తూంటారు బాబూ" నలుగురు కలియగానే యిదేచర్చ ప్రారంభిస్తారు. లాల్ మిత్రుల బుద్ధికూడా లాల్ లాగే అల్లడ, బిల్లడగా కనబడుతుంది. యీ కుర్రోళ్ళు ఎలాగైతే చదు వులో ముందుకుపోతున్నారో, అలాగే వీళ్ళ అనవసరప్రలాపం పెరిగిపోతుంది.

"జానకమ్మగారూ! దీనిపర్యవసానం చాలాచెడ్డగాపరిణమించవచ్చును. నేను నెమ్మదిగా ఊపిరి పీల్చుతూ అన్నాను."

## 4

జమీందారీలో చాలా అవసరమైన పనులున్నందున నేను నాలుగైదు రోజులుండి రావడానికి ప్రయాణమయ్యాను. తిరిగి వచ్చేటప్పటికి బంగళాలో

ప్రవేశించకపూర్వం లాల్ గుమ్మంముందు దృశ్యం నాకంటబడింది. చకితుడనై పోయాను. యింట్లో కాలు పెట్టీ పెట్టడంతోనే నా ధర్మపత్ని విచారంగా నిలబడింది.

"మీరు విన్నారా ?"

"లేదే-ఏమిటిసంగతి ?"

"లాల్ తల్లిమీద భయంకరమైన విపత్తు పడింది." నేను కొంచెం వూహించుకున్నాను. కాని వివరాలు తెలుసుకోడానికి నామనస్సు కంగారు పడింది. "ఏమయింది బాగా విపులంగా చెప్పు."

"మీరు దేనిగురించి యింతకాలం భయపడుతున్నారో ఆఖరుకు అదే అయింది. నిన్న పోలీసుగుంపు లాల్ యింటిని ముట్టడిచేశారు. చాలా సేపు యిల్లు శోధించారు. లాల్ తోసహా పదిహేనుమంది పట్టుబడిపోయారు వాళ్ల ఇండ్లన్నీ శోధించారు. అందరియిండ్లల్లో ఉపద్రవకరమైనవస్తువులు దొరికాయి"

"లాల్ దగ్గర యేమి ... ?"

"లాల్ దగ్గరకూడా రెండు పిస్తోళ్ళు, చాలా తూటాలు, కొన్ని నేర పత్రాలు దొరికాయి. వాళ్లమీద హత్య, విద్రోహం, ప్రభుత్వాన్ని కూల ద్రోసే ప్రయత్నాలు మొదలైన నేరాలు మోపబడ్డా" యని అంటూవుండగా విన్నాను.

"హాఁ చల్లని శ్వాసపీల్చాను. నేను ఎన్నో నెలలనుండి గోలపెడుతున్నాను, ఈ లాల్ ఒకనాడు యీవిధంగా చేస్తాడని. పాపం జానకమ్మకు వచ్చింది యీ కష్టమంతా. ఆమె యెక్కడుంది? వాళ్ల యింటిని శోధా చేసిన తరువాత నీ దగ్గర కొచ్చిందా?

"పిలిపించినా రావడానికి యిష్టపడలేదు. నౌకరుతో చెప్పి పంపింది: 'రొట్టెలు చేస్తున్నాను. ఇంకా హల్వా కూరలు వండాలి. ఇవి తొందరగా పంపకపోతే పిల్లలంతా ఆకలితో చచ్చిపోతారు. జైలువాళ్లు ఉత్సాహవంతులైన పిల్లవాళ్లకి శత్రువులు. ఈ ప్రభుత్వం వాళ్లను ఆకలితో చంపేస్తుంది— నేను జీవించి ఉన్నంతకాలం నా పిల్లల్ని అట్లాచంపనీయను"

"పాపం! ఆమె పిచ్చింది. అమాయకురాలు" నేను దుఃఖంతో మంచం మీద పడిపోయాను. నాకు లాల్ చేసే పనులమీద చాలా విచారం, దుఃఖం కలిగింది.

దీని తరువాత రమారమి ఒక సంవత్సరంపాటు కేసు నడచింది. ఇష్ట మున్న వాళ్ళంతా కోర్టు కాగితాలను చూడవచ్చును. సి.ఐ డి. లు వాళ్ళ ప్రతి నిధులైన ప్రభుత్వవకీళ్లు, ఆ యువకులమీద పెద్ద పెద్ద దోషారోపణలుచేశారు.

దోషులు రహస్య సమితులు స్థాపించారు. వాళ్లి కార్యాలయాల ఖర్చు నడపడానికి దొంగతనాలు చేశారు. ప్రభుత్వ అధికారుల కళ్లల్లో కారం జల్లి రాత్రి సమయంలో దాడిచేసి అస్త్రశస్త్రాలు దొంగిలించారు. మిలిటరీలో విప్లవం తేడానికి ప్రయత్నించారు. ఎవరికి తెలుస్తుంది? యెంతమంది పోలీ సుల్ని హత్యచేశారో! యెట్లా తెలుస్తుంది? యే పోలీసు సూపరెండెంటునో .........! యీ మాటలన్నీ ప్రభుత్వం తరఫునుండి రూఢిచేయబడ్డాయి. ప్రమాణపూర్వకంగా రుజువుచేయబడ్డాయి.

ఈ యువకుల తరఫున సానుభూతిపరులు యెవరున్నారచ్చట? వీళ్లకు అండబల మేది? ప్రభుత్వానికి జడిసి ఏ వకీలు వీళ్ల తరఫున నిలబడి మాట్లాడడానికి పూనుకోలేదు. ఎంతో కష్టంమీద ఒక వకీలు దొరికాడు. కాని అతడుగూడా సమయంవస్తే 'అవును,కాదు' అనే మనిషే అయిపోయాడు. హాఁ! వీళ్ల తరఫున సానుభూతి చూపించేందుకు, నిర్దోషులని రుజువు పరి చేందుకు, అవసరమైతే ప్రాణాల్నిగూడా యిచ్చేటందుకు ఒక వ్యక్తి తయా రుగా ఉంటుంది.

ఆమే జానకమ్మ! లాల్ తల్లి. ఇంట్లో వున్న చెంబులు, కంచాలు, వస్తువులు అమ్మి వేళకు సమయానికి భోజనం అందిస్తుంది. వకీలు దగ్గరకు వెళ్లి పళ్లుకొరుకుతూ రోషంతో అంటుంది :

"ఇదంతా అన్యాయం, అబద్ధం. ఎవరికి తెలుస్తుంది యీలాంటి సామా నులు ఆ పోలీసులు తెచ్చి మా యింటినిండా యెప్పుడు నింపారో? నాపిల్లలు ఉత్తమాటలప్రోగులు— హాఁ నేను దేవుడి కాళ్లంటి ప్రమాణంచేసి చెప్పగలను. మీరు జైలుకెళ్లి వకసారి చూడండి వకీలు బాబూ! పూవులులాంటి ఆ పసి పిల్లలు యెక్కడైనా హత్యచేస్తారా? చేయగలరా?"

ఆమె శరీరం శుష్కించి యెండిపోయింది. నడుం బాణంవలె వంగి పోయింది. నేత్రాల్లో దృష్టి నీరసమైపోయింది; అయినా తన పిల్లలకోసం పరి గెత్తడం, రాత్రనక, పగలనక శ్రమించడం విరమించుకోలేదు.

అప్పుడప్పుడు ప్రభుత్వోద్యోగులు పోలీసులు, వార్డరులు ఈమెను చూచి గొంగళిపురుగల్లే చీదరించుకొని గెంటేసేవారు. ఆమె అలాగే నిలబడి

పోయేది. చేతిలోయున్న కర్రసాయంవలన నడుంకాస్తా సవరించుకొని అరెరే! మీరు ఎలాంటిమనుష్యులు నేనువస్తే నాపిల్లలకోసం ఎంతో ఆశతో పరిగెత్తుకుంటూ వస్తాను. మీరుజూస్తే నన్ను బయటకు గెంటేస్తారు. నేను మీకు ఏమి అపకారం చేశాను నాయనా?

ఆమె అంత్యకాలంవరకు పోలీసులు కపట ప్రవర్తకులు అనే భావన పోలేదు. న్యాయస్థానంలో నీళ్ళకు-నీళ్ళు, పాలకు-పాలు చేసినవాడు నా పిల్లలంతా నిర్దోషులుగా ఋజువై చల్లగా బయటకి రాగలరు. వాళ్ళంతా లాల్ తో కలసి యింటికి వస్తారు. హోఁ హోఁ హోఁ హోఁ హోఁ హోఁ అంటారు. ఆమెను "అమ్మా" అని పిలుస్తారు. ఇదే ఆమె నిరంతరకల్పన.

కాని యీ పిడుగులాంటివార్త చెవుల్లో పడగానే ఆమె నడుం విరిగి పోయింది. లాల్ కి, బొంగడాకి, లకొత్ కి, ఇంకా ఇద్దరు యువకులకు 'ఉరి' యింకా మిగిలిన పదిమందికి పది సంవత్సరాలు కఠినశిక్ష.

జానకమ్మ న్యాయస్థానం యెదుట నడుంవంచి నిలబడింది. యువకులంతా చేతులకుతగిలించిన సంకెళ్ళు వాయించుకుంటూ ఆనందంతో ఊగుతూ, జోగుతూ సంతోషంగా బయటకు వచ్చారు. అందరికంటే ముందు కొంటె వాళ్ళలో ప్రథముడైన బొంగడే కళ్ళల్లోపడింది జానకమ్మ. "అమ్మా!" అంటూవుండగానే బొంగడే పెదవుల్లో చిరునవ్వు తాండవించింది. "అమ్మా! నీవు మాకు హల్వాలు, పూరీలు పెట్టి పెట్టి ఇంతలావుగా చేశావు. ఉరిత్రాడు గూడా పటుక్కుమని తెగిపోయేలాగు మేపావు. మామెడకు త్రాడుతగిలించి ఉరివేసినా చావకుండా కలకాలం జీవించేవుండాలని నీవుద్దేశ్యమనుకుంటాను! కదమ్మా?" అరెరే! బొత్తిగా ఎండిపోయి కట్టెపుల్లలే అయిపోయావే! ఏం పిచ్చితల్లీ నీకు ఇంట్లో తిండిలేదా?

"తనబిడ్డడు లాల్ అన్నాడు అమ్మా! మేమెచ్చటికైతే వెళ్ళుతున్నామో అచ్చటికి నీవుకూడా తొందరగా రావాలి. యిచ్చటినుండి కొద్దిదూరంలోనే వుంది. అమ్మా! ఒక్కవూపిరి పీల్చుకున్నంత దూరముంది. అచ్చట మనమంతా స్వాతంత్రంగా కలుసుకోవచ్చును. నిన్ను మా భుజాలమీద ఎక్కించుకొని ఇటునుండి అటు, అటునుండి ఇటు పరుగెత్తుతాం. తెలుసుకున్నావా? అచ్చట చాలా ఆనందంగాయుంటుంది."

"తప్పక వస్తావు కదమ్మా?" బొంగడే అడిగాడు.

"రాఅమ్మా వస్తావుకదూ?" లాల్ అడిగాడు.

"వస్తావుకదమ్మా" ఉరిశిక్షవిధించబడ్డ ముగ్గురు అడిగారు.

ఆమె నిలువునా వాళ్ళ ముఖాలుచూస్తూ నిలబడిపోయింది. పిచ్చి పిల్లల్లారా మీరెక్కడికిపోతారు? అం దిఅంతరాత్మ.

ఎప్పుడైతే మిత్రులతోసహా లాల్ పట్టుబడ్డాడో, ఆనాటినుండి ఊళ్లో వారు, వీధిలోవారు, జానకమ్మతో మాట్లాడడానికి జడిసేవారు. త్రోవలో ఆమెనుచూస్తే ప్రక్కప్రక్కలకు తప్పుకుపోయేవారు. ఆమెఅంటే నాకెంతో ప్రేమ కాని నేనుగూడా వీలైనంత దూర దూరంగా ఉంటూ వున్నాను. తెలుసుండిగూడా తన తలను ఎవరు వరకంలో పెడతారు? ప్రభుత్వానికి ద్రోహం చేసినవానితల్లితో!

ఆరోజు స్నానం చేసినతరువాత గ్రంధపఠనకోసం గదిలోకి వెళ్లాను. ప్రఖ్యాతవ్యక్తి వ్రాసిన కృతి కొంచెంసేపు చదవాలని కుతూహలం కలిగింది. మేజనిర్వ్రాసిన పుస్తకం తెరిచేటప్పటికి మొదటి పుటలోనే పెన్సిలు వ్రాత చూసి దిగ్భ్రాంతుడనైపోయాను.

చూచేటప్పటికి అది లాల్ హస్తాక్షరాలు. నాకు జ్ఞాపకం వచ్చింది. మూడేళ్ల క్రితం లాల్ యీ పుస్తకం నాదగ్గర తీసుకొని చదివాడు. ఎందుకో నా మనస్సులో లాల్ మీద కనికరంకలిగింది. లాల్ తండ్రి స్వర్గీయుడు రామనాథ్ నా కళ్లె యెదుట కనబడ్డాడు. ఈ అనామకుడు లాల్, సిద్ధాంతాలు, విచారాలు ఆచరణాలవల్ల జానకమ్మ పడుతున్న పాట్లు జ్ఞాపకానికి వచ్చేసరికి జానకమ్మతోపాటు నామీదకూడ వజ్రపాతం జరిగినట్టు తోచింది. ఈహస్తాక్షరాలు చూస్తుంటే నా మనస్సు వికలమైపోయింది. నా ముఖంలోనుండి నిర్జీవంగా శ్వాస ఒకటి బయటుపడింది.

రెండో క్షణములోనే పోలీసు నూపరెండెంటు జ్ఞప్తికొచ్చాడు. అతని అనుమానమైన చూపుల్లో మనస్సును కలవరపెట్టే భావాలు ఈనాటికి నన్ను కదలిస్తూనే యున్నాయి. అతడి కర్కశమైన చేతిలో లాల్ ఛాయా చిత్రం చూస్తుంటే లాల్ వచ్చి నా గొంతుక నులుమేస్తున్నట్లుగాయుంది. నేను రబ్బరు తీసికొని లాల్ పేరు చెరుపుతున్నాను. అదేసమయంలో నా భార్య, లాల్ తల్లి జానకమ్మను తీసుకొని నాగదితో ప్రవేశించింది.

జానకమ్మను చూడటంతోనే హృద్వేగం ఆపలేకపోయాను. "ఏమమ్మా! నీవు పూర్తిగా మారిపోయావే? పిచ్చిదానిలాగ అలాచూస్తున్నావేం?" ఆమె నిశ్శబ్దంగా కాగితం నా చేతి కందిచింది. నేను చూశాను. దానిలో... జైలు

ముద్ర వుంది. శిక్ష చెప్పిన తరువాత పంపబడింది. నీ నర్థం నాకు తెలుసు. కవరు చించి మాడగా అది అతడి ఆఖరు సందేశం. నేను కొట్టుకుంటున్న గుండెల్ని చేతితో గట్టిగా పట్టుకొని, బిగ్గరగా చదువసాగాను :

"అమ్మా !

ఈ నా అంతిమ సందేశం అందిన ఉదయమే, ఎర్రని కిరణాలతో ప్రకాశించే బాల సూర్యుని రథంమీద సగౌరవంగా అనంతాకాశంలోకి ప్రయాణమై వెళ్ళిపోతాను. నేను కోరి నట్లయితే అంతిమ సమయంలో నిన్ను దర్శించేవాడ్ని. కాని దానివల్ల లాభం యేముంది ? నాకు జన్మజన్మాంతరాలకే నీవే నా తల్లిగా ఉండాలని విశ్వసిస్తూయున్నాను. నిన్ను విడిచి నే నెక్కడికి వెళ్ళగలను ? అమ్మా ! ఎంతవరకైతే పవనుడు శ్వాస పీల్చుకుంటాడో, ఎంతవరకైతే సూర్యుడు వెలుగుతుంటాడో, ఎంతవరకైతే సముద్రుడు ఘోషిస్తాడో, అంతవరకు ఏలాంటిశక్తి కూడా నీ కరుణామయమైన ఒడిలోనుండి నన్ను వేరుచేయ లేదు. నీకోసం సూర్యుడు అరుణరథాన్ని తీసికొస్తాడు. నేను, బాంగడా, తక్కిన నా మిత్రులు నీరాకకై యెదురుచూస్తుంటాం. మన మంతా కలశాం, కలుస్తాం, కలువగలం హాఁ ఇది సత్యం.

నీ....లాల్...."

కంపిత హస్తాల్తో చదివిన తరువాత యీ భయంకరమైన పత్రాన్ని మడిచేసాను. నా పత్ని నేత్రాలు అశ్రుపూరితాలైనాయి. లాల్ తల్లి జానకమ్మ నిలుచున్నది నిలుచున్నట్లే చైతన్యవిహీనురాలైంది. చేతనున్న కర్రనానుకొని, చలనంలేని కళ్లతో మావైపు అదేపనిగా చూస్తుంది చైతన్యవిహీన ప్రతిమల్లే.

క్షణకాలం ఆగినతరువాత చేయిచాచి మౌనభాషలో నా చేతిలోనున్న పత్రాన్ని అడిగింది. మాతో మాట్లాడకుండా యంత్రంలాగున చేతి కర్రనానుకొంటూ, వంచిన నడుం వంచినట్లే వెళ్లిపోయింది జానకమ్మ.

నేను శూన్యంలోకి చొచ్చుకొనిపోయే చూపులతో అలాగే కూలబడిపోయాను. తల గిర్రున తిరుగుతుంది. నా యీ బాధంతా లాల్ గురించికాదు, శిక్షించిన సర్కారు గురించి కాదు. పాపం! జరాభారంతో కృంగి కృశించిపోయే జానకమ్మ స్థితి. నన్ను ద్రవింపచేసింది. ఆమె నిశ్శబ్దతలోయున్న గంభీరత అగ్ని పర్వతాన్ని జ్ఞప్తి తెస్తుంది.

మధ్యాహ్నం ఒంటిగంట కొట్టారు. నేను కొంచం కోలుకున్నాను. నా హృదయాంతరాళంలో కలిగే అలజడి నెమ్మదినెమ్మదిగా ప్రతి రక్తపుకణంలోకి చొచ్చుకుపోయి మళ్లీ ఒకసారి నన్ను కంపింపజేసింది. ఇంతలో నా భార్య వచ్చి పలుకరించింది. వెళ్ళిపొమ్మని చేతితో సైగచేసాను. పుస్తకంలోనున్న లాల్ హస్తాక్షరాలు చూసేటప్పటికి, నా సుఖజీవంమీద, నా జమీందారీ హోదామీద, ధనికజీవనంమీద, యింకా ఆ పోలీసు ఉద్యోగి నిర్దయ నీరస నిస్సారాలతో మిళితమైన చూపుమీద దృష్టిపోయింది. మనస్సు కలగిపోయింది. చేతితో ప్రక్కనున్న రబ్బరు తీసి కళ్ళకు పెనుభూతంలా కనబడే లాల్ పేరు నాశనంచేయదలచాను.

" అమ్మా.........!"

ఏదో ఆవేదనహృదయం అమ్మకై ఆక్రందిస్తుంది కాబోలు, కిటికీ దగ్గరగా వెళ్ళి లాల్ గృహాన్ని చూస్తున్నాను. నల్లటి ముసుగు నా మీద కప్పినట్లుగాయుండి నా కేమి కనపడ్డంలేదు. చెవిచ్చి విన్నాను. ఏమీ వినబడలేదు. ఇదంతా నాలోజనించిన భ్రమనుకొన్నాను. జానకమ్మ మాట్లాడితే వినబడేదేగాని, ఆమె కంఠమునుండి ఒక్కమాటైన వెగలలేదు. అది ఆమె స్వభావానికే విరుద్ధం. ఇంకెలా మాట్లాడుతుంది. తనభర్త చనిపోయినప్పుడు కూడా సాధారణ స్త్రీలల్లే ఆమె గతించినదానికి చింతించి ఎరుగదు.

నేను తిరిగి అదే ఆలోచిస్తున్నాను. ఆ అనామకుడిగురించి జానకమ్మ ఏమేమి త్యాగం చెయ్యలేదు? ఆటబొమ్మను పసిపిల్లలు ఎలా ఆరాధిస్తారో అలాగు ఆరాదించిందే! ఆమెచేసిన అపరాధంఏముంది? "లాల్ నీవు నిజంగా నీ తల్లి బాధ తెలుసుకోలేని అనామకుడవు, దౌర్భాగ్యుడవు!"

"నాయనా ...!" ఆర్తనాదం. మళ్లీ అదేధ్వని. యజ్ఞ పశువుయాగ మండపంలో అరచే అరుపది. గుండెల్ని కరిగించే కరుణారావంతో కలసిపోయే ఆర్తనాదం అది. చీకటి తెరలు చించుకొని ఉషఃకాంతులు బయటపడుతున్నాయి. పసుపు కాంతులు యర్రదనందాల్చాయి. అరుణరధారూఢుడై

సూర్యభగవానుడు తూర్పుదిశనుండి వస్తున్నాడు. లాల్ వ్రాసిన పత్రం జ్ఞప్తికొచ్చింది.

"అమ్మా..............!"

లాల్ తన తల్లిని పిలుస్తున్నాడల్లేవుంది! ఆ పిలుపుకై జానకమ్మ నిరీక్షిస్తుందన్నట్లుగా నాలో భావనకలుగుతోంది. నా గుండెలు కొట్టుకుంటున్నాయి. వెంటనే నౌకర్ని పిల్చి చెప్పాను :

"లాల్ తల్లి జానకమ్మ యేంచేస్తుందో చూసిరా ?"

నౌకరు వచ్చేలోపుగా మళ్లీ రబ్బరుతీసి లాల్ పేరు చెరిపే ప్రయత్నంలో ఉన్నాను. నౌకరు రోజుకుంటూ వచ్చి అన్నాడు : "బాబూ! ఆమె స్థితి విచిత్రంగాయుంది. తలుపుకు తాళంవేసుంది. దర్వాజాదగ్గర కాళ్లు చాచి, చేతిలో యేదో చీటీపట్టుకొని ముఖం తెరచుకొని చచ్చిపోయింది. హాఁ బాబూ! నా మాట విశ్వసించండి– ఆమె నిజంగా చచ్చిపోయింది. ఊపిరి ఆగిపోయింది, కళ్లు తెరచుకొనేయుంది"

నేను నిర్ఘాంతపోయాను.



# ఖైదీ

ఆకలికి ఆగలేక పస్తులతో కుమిలి కుమిలి ఎండి వరుగులైపోయిన భార్యా పిల్లల్ని చూచి, ఆవేదన సహించుకోలేక, విధిలేక ఒకనాడు భార్యా బిడ్డలకు తన చేతితోనే విషమిచ్చి కలకాలానికి శాంతి చేకూర్చాడు వెంకన్న.

హత్యానేరం క్రింద హంతకుడికి ఇరవైఏళ్లు కఠిన నరకం ప్రసాదించింది న్యాయస్థానం.

మూడేళ్లగా తనకు చేదోడు వాదోడుగాయుంటూ ఒకేగదిలో ఒకే విధంగా తనతో సమానంగా జైలు జీవితాన్ని గడిపి శిక్షాకాలం పూర్తిగాక మునుపే ప్రాణాల్ని విడచిన బాబు జీవితాన్ని కధగా తోడివాళ్లతో చెబుతూ హృదయభారాన్ని తగ్గించుకోనేందుకు ప్రయత్నిస్తున్నాడు వెంకన్న.

యీవేళ ఉదయమే సరిక్రొత్త ఖైదీ బాబూ విడిచిపోయిన ఖాళీ జాగాని ఆక్రమించడానికి వచ్చాడు. ఖైదీలు సాయంత్రం భోజనాలైనంతనే ఎవరి గదికివాళ్లు వెళ్లిపోయూరు. వెంకన్న క్రొత్తపరిచయుడు రామస్వామితో తన గదిలో ప్రవేసించాడు. వార్డరు ఇనుపతాళాలు బిగించి వెళ్లిపోయాడు. గదంతా నిశ్శబ్ధంగాయుంది. క్రొత్తఖైదీకినిద్రపట్టడంలేదు. నెమ్మదిగా వెంకన్నను సంభోదించి "తాతా! క్రొత్త జాగాలో నిద్రపట్టడంలేదు. ఏదైన కథ విని పించ" మన్నాడు క్రొత్త ఖైదీ రామస్వామి. క్రొత్తవాళ్ళంతా ఇలాగే అడుగుతారని పదిహేను సంవత్సరాల జైలుజీవి వెంకన్నకు తెలుసును. బాబు గూడా మొదట్లో యిలాగేఅడిగాడు. 'ఈవేళ రామస్వామి, రేపు ఇంకెవరో!' అనుకొంటూ గొంతుక సవరించుకొని, బాబూ జీవిత చరిత్రను చెప్పడానికి ఉప

క్రమిస్తూ "అబ్బాయ్! నే చెప్పబోయేది కథ కాదు, వ్యథ. నిన్నటితోనే ఆఖరు అధ్యాయంగూడా పూర్తిఅయింది. నీవు వినబోయేఘట్టం, యింతవరకు ఎవరూ వినలేదు. వినే భాగ్యం నీకు, చెప్పే భాగ్యం నాకు లభించింది. పరధ్యానంగా వుండకు. ఈ వ్యథతో కూడిన కథ చాలా రసవంతంగా యుంటుంది" అంటూ ప్రారంభించాడు.

బాల్యంనుండి బాబు యెంత అల్లారుముద్దుగా పెరిగాడో ఆ గాథంతా వింటూంటె నిర్ఘాంతుడై వేడి నిట్టూర్పు విడిచాడు రామస్వామి. ఘట్టాలన్నీ ఒక్కొక్కటే విపులంగా వర్ణించేటప్పుడు వింటున్న రామస్వామి పెదవుల్లో ఆనందం తాండవించేది.

విద్యాభ్యాసంలో గతించిన స్వర్ణదినాల్ని, బాబూ పొందిన బహుమతుల్ని ; బి. ఏ. తరగతిలో ప్రథముడుగా వచ్చినప్పుడు కళాశాల విద్యార్థులు అభినందించినఅభినందల్ని పట్టప్రధానోత్సవ సమయంలో ఆచార్యులు బాబూను ఆశీర్వదిస్తూ పలికిన పలుకుల్ని, వెంకన్న వర్ణిస్తుంటే రామస్వామి కళ్లు మిలమిల మెరిశాయి. వెంకన్న చెబుతూనేపోతున్నాడు.

గొప్పగొప్పవారంతా సందేశాలందజేసారు. విందులకు పిల్చారు. అభినందన పత్రాలతో పెట్టెలు నిండాయి. వాటి నన్నిటిని భద్రంగా దాచుకొని ఇంటికిచేరాడు బాబు. విద్యాసాగరుడై వచ్చిన కొడుకును జూచి ముసలి తలిదండ్రులు మురిసిపోయారు. ఇంతకాలం కష్టనిష్టురాలకోర్చి, వస్తులు బొరాదుల పడి, తినీతినక ఉన్నది కాస్తా అప్పులవాళ్ళ కాహుతికావలసిన సమయంలో కొడుకు రావడం, అందులో ఎన్నో మన్నలనుపొంది రావడం ఆ తల్లిదండ్రులకు అడవిలో ప్రయాణంచేస్తూ దాహంతో అలమటించే బాటసారికి నీరు దొరికినట్లయింది.

'ఈ వృద్ధాప్యంలో తగు సమయానికి కుమారుడు చేతికందాడు. ఇంక మనకేమీ భయంలేదు. పెద్ద ఉద్యోగమే దొరుకుతుంది. దొరక్క ఏంచేస్తుంది? మన అబ్బాయి తక్కువచదువు చదివాడా! తక్కువ ఉద్యోగం రావడానికి?' అనుకొంటూ వాదోపవాదాలు చేసుకొనేవాళ్ళు ఆ వృద్ధ దంపతులు.

బాబు తండ్రిగూడా గ్రామంలో తగు పలుకుబడి కలిగి నలుగురిలో పెద్దమనిషి అనిపించుకుంటున్నవాడే. ఏదో భగవంతుడిచ్చినకాడికి పదిహేను ఎకరాల కొంద్ర, తాతలు మిగిల్చిపోయిన పురాతన లోగిలి గొడ్డూగోదా కలిగి అడిగిన వారికి, కలిగినకాడికి లేదనకుండా గౌరవంగానే జీవించాడు. బాబు

ఒక్కడే లేక లేక నడివయస్సులో కలిగిన సంతానమవడంవల్ల అల్లారుముద్దుగ పట్టుపరుపులమీద, ఊగుటుయ్యాలలో మల్లిపూవులాగ పెరిగేడు. బాబు తండ్రి కొండంత ఆశలుకొడుకుమీద పెట్టుకొని జీవిస్తూండేవాడు.

పూవు పుట్టగానే పరిమళిస్తుందన్నట్లుగా పసితనంలోనే ప్రతిభ వెల్లడి కాజొచ్చింది.

తన కొడుకు తెలివితేటలను గురించి ఇతరులు పొగిడే పొగడ్తలకు మైమరచిపోయేవాడు బాబు తండ్రి. పట్నం చదువు చదవించండే వీళ్లే నన్నారు గ్రామీణులంతా. వాళ్ల మాటలు కాదనలేకపోయాడు. తన కొడుకు బాగుగురించి ప్రజకే యింత ప్రేమ యున్నప్పుడు, కన్నతండ్రినైన నాకేవాలేంది అనుకున్నాడు. కొడుకుని పట్నం చదువు చదివించాలని తీర్మానించుకున్నాడు. బాబు పట్నంలో చదువేటప్పుడు. ఏనెలకానెల దేవుడి ముడుపుకుమల్లె డబ్బు వచ్చేది.

బాబు తండ్రి ఇల్లు గుల్లయిన, వడ్డీలకు వడ్డీలు పెరుగుతున్నా, అమ్మిన వస్తువులు అమ్మగా ఆఖరుకి ఇల్లు, పొలంకూడా అప్పులవాళ్ళకు ఆహుతి అయ్యే స్థితికొచ్చాయి. కొడుకు ఇంటికొచ్చాడు.

బాబుకి పెండ్లి ఒక మంచి సాంప్రదాయమైన కుటుంబంతో జరిగింది. శారద చనువుకుంది. అందాల భరిణె. అందానికి తగ్గ వినయం. వినయానికితగ్గ నడత, సద్గుణాలకు చక్కని ఉదాహరణ శారద. భర్త ప్రేమను చూరగొని అతడి హృదయంలో స్థానం పదిలంచేసుకుంది.

ఆరు మాసాలు గతించాయి. ఇంటిపరిస్థితులు అవగాహన కాజొచ్చేటప్పటికి ఉద్యోగంకోసం బాబు ఆత్రుతతో అర్రులు చాచవలసివచ్చింది. ఉద్యోగాన్వేషణానికి కొండంతఆశతో ఉదయమేలేచి వెళ్ళేవాడు. సాయంత్రమయ్యేటప్పటికి పుట్టెడు నిరాశ నెత్తిమీద పెట్టుకొని గూటికి చేరేవాడు.

రెండేళ్ళు ఏవిధంగా గతించాయో దేవుడికే తెలియాలి. రోజురోజు పుట్టగొడుగులల్లె పెరిగిపోయే అప్పుల భారాన్ని మోయలేక, గుండెబరువెక్కి మంచాన్నిబడి నలిగి, నలిగి ప్రాణాలు విడిచాడు బాబు తండ్రి. మందుకైనా చేతిలో కానీలేక, మంచంలోఉండే తండ్రి ముఖం చూడలేక, బాబు పైపైనే ముఖం దాచుకొని తిరిగేవాడు. తనని అల్లారుముద్దుగా పెంచి పెద్దచేసిన తండ్రి గతించాడు. తన శ్రేయస్సుకొరకు కండలు పిండిగజేసి, రక్తాన్ని వడగట్టి కూడబెట్టిన ఆస్తంతా కొడుకు కోసం తృణప్రాయంగా ధారపోసి అంత్య సమ

యంలోగూడా, పల్లెటూర్లమైనా ఆడేని తండ్రి గతించాడు. సమయానికి మందుంటే బాబు తండ్రి బ్రతికేవాడేమో? చేతిలో డబ్బులేదు, తండ్రికి మందు లేదు.......................

తండ్రి చనిపోయినగదిలో ఒంటరిగా కూర్చున్నాడు. మనస్సులో ఏవేవో భావాలు వీధిస్తోన్నాయి కాబోలు వీస్తాలోపనుల్లో పడ్డాడు. తనలో తను అనుకుంటున్నాడు: "చేతులారా కన్నతండ్రిని చంపుకున్నాను. యీ నా తండ్రి మృత్యువుకి నేనే కారకుడ్ని. నా తండ్రి సంపాదించిన ధనాన్ని విద్య పేరుమీద విరజిమ్మి కూటికి కొరగాని కష్టపు చదువులు చదివి విద్యాసాగరుడననే బిరుదు విహించిన నేనే నా తండ్రిని కళ్ళార చూస్తూ చూస్తూ హత్యచేశాను. యీ అపరాధం నాది. నా రక్త మాంసాల్ని పీల్చి పిండిజేసి యెందుకూ పనికిరానివాడ్నిగా తయారుచేసిన నావిద్య దీ అపరాధం. నా అజ్ఞత, నా యశస్సు, నా కీర్తి, నా పేరుప్రతిష్టలు, చివరకి ఉరిత్రాళ్లుగామారి నా తండ్రి గొంతుక చుట్టూ చుట్టుకొని ఊపిరాడకుండా బిగించేశాయి. నా తండ్రి చచ్చిపోయాడు. నా మీద ప్రేమే నా తండ్రికి మృత్యువై పోయింది. అదిగో! ఆ గోడకు వ్రేళ్లాడే ఆ రాక్షసే నా తండ్రిని పొట్టలో పెట్టుకుంది. ఆ రాక్షసికే నా రక్త మాంసాన్ని నా సంపత్తిని బలిజేసాను. చివరకు నా తండ్రినిగూడా దాని నోటికే అందించాను. నన్ను భిక్షకుడిగా తయారుచేసింది. నా కుటుంబాన్ని సర్వనాశనంచేసింది. నా మూర్ఖత్వాన్ని చూచి నవ్వుతూ నన్ను అవహేళనచేస్తున్నట్లు నాకేసేచూస్తున్న ఆ పైపై మెరుగుల, పాడు కాగితమే కారణం." అంటూ ఆవేశంతో గోడకు వేళ్లాడుతున్న బి. ఏ. డిగ్రీని ఊడబెరికి కసిదీర నేలకేసికొట్టి ముక్క ముక్కలుగాచించి అగ్నిలో పారేశాడు.

భార్య మెడలో నల్లపూసలు తప్పితే ఇంకేమీ మిగలలేదు. అప్పులతో పస్తులు ఎన్నాళ్లు గడుస్తాయి. ముసలి తల్లిగూడా లౌకికబంధాలు తెంచుకుని పరలోకానికి ప్రయాణమైంది. బాబు గుండెల్లో అగ్ని పర్వతం పతేలున పగిలి నట్లయింది. తల్లి ఆకలితో చచ్చిపోయింది. చావక యేంచేస్తుంది? ఆకలి దేవతతో పోరుసల్పడానికి తల్లి కండరాల్లో బలమేదీ? అది ఏనాడో నశించి పోయింది. తుదకు ఆకలిదేవతకాహుతైపోయిందితల్లి.

అర్ధరాత్రి అయింది బాబుకు నిద్రపట్టలేదు. కన్నకలలు కరిగిపోయాయి. ఆశాసౌధాలు కూలిపోయాయి. భావి జీవితరథం బురదలో కూరుకు

పోయింది. చేయూతనిచ్చి సహాయపడే వ్యక్తి కనుచూపుమేరలో కనపడ్డం లేదు. ప్రాణమిత్రులు పిలిచినా పలుకక యెడమొఖం పెడమొఖం పెట్టుకొని తిరిగేవారు.

రెండు రోజులనుండి పొయ్యిలో పిల్లి లేవడంలేదు. పొరుగు నున్న కలిగిన వారైనా చారెడుగింజలు అప్పు యీయడానికి జంకారు. బాబుకళ్ళకి భవిష్యత్తు భయంకరంగా కనపడుతోంది. అదృష్టంమీద, నుదుటి రాత, చేతి రేఖలమీద ఆధారపడితే రోజులు గడిచేటట్టులేవు.

"నుదుటన్ వ్రాసిన వ్రాత మాన్పతరమా నూరేండ్లు చింతించినన్" అన్న పిచ్చి వేదాంతి మాటల్ని నమ్మిచేయూలని నడుం బిగించి ఆ చీకటిలోనే చేతితో శరీర కండరాల్ని తడుముకున్నాడు. ఎముకలు గలగలమన్నాయి. ఎముకల్లో సారాన్నంతా చదువే త్రాగేసింది. ఇంకా బల మెక్కడనుండి వస్తుంది? తిండి కలిగితేనేగా కండ బలవడానికి! తెల్లవార్లు కళ్ళల్లో కాగడాలు పెట్టుకొని వెదకినా తిండి దొరికే మార్గంకనిపించ లేదు..............................

ఆలోచనలతోనే తెల్లవారింది. వెలవెలబోతూన్న ముఖంతో సూర్యుడు వస్తున్నాడు. కరకరమని ప్రొద్దెక్కింది. కడుపులో ప్రేవులు కలబిలమన్నాయి. 'ఊరు పొమ్మంటోంది. కాడి రమ్మంటోంది' అన్నట్లుగాయుంది బాబు అవస్థ. గత్యంతరంలేక సంసారాన్ని సంచిలో పెట్టి భార్యాభర్తలు పట్నానికిప్రయాణ మయ్యారు. నడకసాగుతుందేగాని పరస్పర సంభాషణగూడ లేదు. చేరబోయే యూరికి పొలిమేరలోయున్న చెరువు గట్టుమీద కూర్చొని కొంచెంసేపు సేద తీర్చుకున్నారు. భారమైన హృదయంతో బరువెక్కిన కాళ్ళతో నెమ్మదిగా పట్నంలో ప్రవేశించారు.

ఎవరో భాగ్యవంతుల పెండ్లి కాబోలు అట్టహాసంగా జరుగుతోంది! పందిట్లో దండధారులైన నౌకర్లు ముష్టివాళ్ళను దరిదాపులకు రానీయకుండా ముప్పుతిప్పలు పెడుతున్నారు. వస్తూపోతున్న బంధువులంతా నొడలిరుగని వస్తువులతో మెరిసిపోతున్నారు. ఆనప బుర్రలాంటి బొర్రలు పెంచి బర్రెల్లాగు బయటకు తేనుపుకుంటూ వస్తూన్న పెద్దల్ని చూచి శారద కడుపులో ఆకలి కలవరపెడుతున్నా పక్కున నవ్వింది.

బాబు చూపు ఆ ప్రక్క కుళ్లు కాలువలో పారవేస్తున్న ఎంగిలాకుల

కోసం పంతాలు వేసుకొని పరుగులుతీస్తున్న పదేళ్ళలోపు పసిపిల్లలమీదికి పోయింది. పాపం! అంతకుముందే వాటికోసం కుక్కలు, పందులు కాచుకొని కూర్చొన్నాయి. వీళ్ళను చూచి కుక్కలు 'భౌ భౌ' మన్నాయి. పందులు గుర్రుపెట్టాయి.

పసిపిల్లలైనా వాటి సంగతి వీళ్ళకు బాగా అనుభవమే. ఇంతకుముందు ఎన్నో జాగాల్లో యిలాగే పోటీలుపడి గెలిచి వాటి నోళ్ళల్లో బలవంతంగా ఇరుకించుకున్న బొబ్బట్ల ముక్కల్ని, ఆవకాయ ముక్కల్ని పెకలించి బయట తెచ్చుకున్నారు. విజయగర్వంతో వాటిముందే కేరింతాలు కొట్టేరు. ఈలాంటి గుర్రుగుర్రు శబ్దాలెన్నో విన్నారు. మొరిగిన కుక్కలకి కరవడం చేతకాదని వీళ్ళకు బాగా తెలుసు.

ఇంతలోనే తిని పారేసిన విస్తళ్ళు పడ్డాయి. శత్రువు మీదికి వీరుడు దుముకేటట్టుగా ఒక్కుమ్మడిగా పదిమంది పిల్లలు విరుచుకుపడేటప్పటికి కుక్కలైతే జంకాయి గాని పాతేసిన గుంజల్లాంటి పందులా వీళ్ళకు జడిసేవి? వాటి నోటి కందిన ఎంగిలివిస్తర్లను చప్పరించుకుంటూ పోతున్నాయి. మొదటిసారి జయం పందులకే లభించింది. ఈసారికైనా జాగ్రత్తగా యుండకపోతే లాభం లేదనుకున్నారు పిల్లలు. వాళ్లల్లో వాళ్లు ఏమిటో గుసగుసలాడుకున్నారు. తలా ఒకవేపు పడబోయే విస్తర్లకోసం కాచుకున్నారు. పందులుగూడా 'బహు పరాక్' చెప్పుకున్నాయి. కుక్కలు తోక లాడించాయి.

ఇంతలో ఒకే ఒక ఆకు పడింది. పంది ఒకటే దూకు దూకింది. కుక్క అరచి ఆకుమీద విరుచుకుపడింది. ఈ రెండు జంతువుల మధ్యలో అంతకు ముందే పిల్లోడుచేయి ఆకుమీద పడింది. నాదంటే నాదని పందిమీద కుక్క, కుక్కమీద పంది యీ రెండిటి వీపులమీద బోరగిలబడి, చేతులు చాచి వాటి నోటి దగ్గర ఆకు లాక్కోవాలని పిల్లోడూ గింజుకుంటున్నాడు. చివరకు సగం తిని పారేసిన ఆవకాయ ముక్క దొరికింది పిల్లోడికి. దానినే అపురూపంగా నాక్కుంటూ, చీక్కుంటూ మోకాలిచిప్ప బద్దలై నెత్తురు కారుతున్నా లెక్కచేయకుండా భాగం పంచుకోడానికి పైపైకి వస్తున్న పందులు, కుక్కలు పిల్లల గుంపుల్ని తప్పించుకుని పారిపోయాడు.

బాబు, కళ్లార ఇదంతా చూస్తూ విస్తుపోయాడు. ఇంకోవేపు చూసే సరికి, అడుక్కునే అయ్యలంతా నిశ్శబ్దంగా ఒకమూల చీనారేకు డబ్బాల్ని ముందుపెట్టుకొని మర్యాదగా కూర్చున్నారు.

'దొరలంతా తినగా మిగిలిందంతా మనదే' అన్నట్లు. యీ కంకాళ బృందాన్ని చూసేటప్పటికి బాబు గుండె ద్రవించిపోయింది.

"పూర్వ జన్మలో యే పాపఫలితంగా లభించిందీ జన్మ వీళ్ళకు? ఇది ప్రకృతి ద్రోహా? లేక సద్గతికా?........"

బాబు కళ్ళకు వీళ్ళంతా ఋషులు, యతులు, మహర్షులు, మునులల్లే కనబడ్డారు. అంతా గీతాచార్యులే, నోటి మాటలతో గాక చేతలతో గీతా రహస్యాన్ని చూపెటుతున్నారు. లేకపోతే ఆ పందులు, కుక్కలు, నేనూ సమానమే అంటూ ఆచరించి చూపడం సాధారణ మానవులకు సాధ్యమా?

"యీ సమత్వం కోసమేగా మహనీయులు అరణ్యాల్ని శరణ్యం చేసుకుంటారు. పదేళ్లు దాటని పసికూనలలోనే యీ సమత్వభావం కరుడుగట్టిపోయిందే! శ్రీకృష్ణుడికే గురుత్వం ప్రసాదించే వరప్రసాదుల్లా వున్నారు వీళ్ళంతా, కుళ్లు గిళ్లు వాసనా గీసనా జంతువులు, జాడ్యాలు అన్న భేద భావం వీళ్ళల్లో మొదలంటు నశించిపోయిందే!" అనుకుంటూండగా బాబు పెదవుల్లోనుండి గీతాశబ్దం మెల్లిగా రాసాగింది.

"అద్వేష్టా సర్వభూతానాం
మైత్రఃకరుణ ఏవచ
నిర్మమో నిరహంకారాస్సమదుఃఖ సుఖః క్షమీ
సంతుష్టసతతం యోగీయతాత్మా దృఢనిశ్చయః
మయ్యర్పిత మనోబుద్ధిర్యోమద్భక్తస్సమే ప్రియః"

అంటూండగానే మళ్లీ ఆదైన్యముఖాల మీదికి చూపు పోయింది. మొడలు గగుర్పొడిచాయి. "మోసం, అంతా చెప్పరాని మోసం. కూటికిరాని వేదాలెందుకు? చేతుకిరాని నీతులెందుకు? ఇదంతా వట్టిమోసం. పేదల ప్రేవుల్లో ప్రజ్వరిల్లే అగ్ని నార్పడానికే గీతలో వేదాల్లో సర్వశాస్త్రాల్లో శాంతివచనాలు పలుకబడ్డాయి. కాలేకడుపుకు కూడుపెట్టలేక ఆచార్యులమంటూ మతాలు స్థాపించుకొని, తెగతిని అడ్డంగాబలిసి గడ్డాల్ని సవరించుకుంటూ "సోమరిపోతులాంటి యీ స్వాములంతా కలసిపన్నిన పన్నాగాలే యీ శాంతి వచనాలు. యీ చిదంబర రహస్యాలు. మూడు రోజులపాటు ముద్ద బొరకకపోయిననాడు చూడాలి వీళ్ళతిప్పలు, ఆ నాడు యీ శాంతి వచనాలు పంగనామాలు కుక్షింభరత్వాలు కూలిపోయి చిప్పచేతికి వచ్చిన

నాడు యీ చిలుకపలుకులు పలుకుతారేమో చూడాలి" అనుకుంటుండగానే శారద భర్తవేపు, 'పదండి పోదాం' అన్నటుగా చూసింది. పెండ్లిపందిరినుండి నిట్టూర్పుతో నిష్క్రమించారు.

కూలీలు నివసించే పూరిగుడిసెల దగ్గరగా చేరుకున్నారు. దాహం తీవ్రంగా వేస్తోంది. కాసిని గంజినీళ్ళయినా యీసమయంలో ఎవరికైతే బాగుండు ననుకున్నారు గాని ఒకరితో నొకరు చెప్పుకోలేకపోయారు. కొట్టపు వసారంలో కుక్కిమంచంలో కూర్చున్న వృద్ధుడు బాబు తనకేసే రావడం చూసి మంచం దిగి "ఏం నాయనా? ఏమి కావాలి? ఎప్పటినుండి వస్తున్నావు? అమ్మాయి అచ్చటే నుంచుండిపోయిందేం? ఇంట్లోకి తీసుకురా. మీ ముఖాలు చూస్తుంటే ఎన్నాళ్లనుండో భోజనం చేయనట్టున్నారు" అంటూనే లోపల వంటచేస్తున్న ముసలమ్మను పిలచి "వీళ్లకు ముందు ఏమైనా యుంటే పెట్టు. పాపం! తమలపాకులులాంటి శరీరాలు కమిలిపోయాయి. ఎంతదూరంనుండి నడిచివస్తున్నారో పాపం! తొందరగా వంటకానియ్యి" అని బాబు చేయి పుచ్చుకొని చేతినున్న సంచి తీసి ఇంట్లో భద్రపరిచాడు. శారద వగర్చుతూ నెమ్మదిగా బాబుప్రక్క అరుగుమీద కూలబడిపోయింది. ఇంతలో ముసలమ్మ నాలు గ్లాసుల నిండుగ చిక్కటి మజ్జిగ తెచ్చి ముందు శారదకు తరువాత బాబుకు ఇచ్చింది. వడ గొట్టుకుపోతున్న ప్రాణాలు గూటికి చేరాయి.

ఆ రాత్రి కలిగిన కలోగంజో అంతా కలసి తిన్నారు. బాబుకళ్లకి ఈ అపరిచిత ముసలి దంపతులు పార్వతీ పరమేశ్వరుల్లా కనబడ్డారు. వారి ఆదరణ, కరుణ, వాత్సల్యం బాబును ముగ్ధుణ్ని గాచేశాయి. బీదవాళ్ల హృదయాల్లోనే కల్లాకపటంలేని అనురాగం లతలల్లే చిగుర్చుతూ కాచిపూచి కలసిమెలసి కాపురముండడం బాబు చూసి ఆశ్చర్యపోయాడు. బాబు పూర్వ చరిత్రంతా పూసగ్రుచ్చినట్లు ఆత్మ బంధువులైన తాత ముసలమ్మకు చెప్పుకున్నాడు.

ముసలి దంపతులు బాబు గాథంతా విని కన్నీరు కార్చుతూ "అయ్యో నాయనా! ఎన్ని పాట్లుపడ్డారు!! పాపం! ఆపదలు ధనవంతుల ఆగ్రహానికి ఆగలేక మన పంచల్లోనే కాపురముంటాయి. వాటికిగూడా మనమే ఆశ్రమివ్వాలిమరి" అంటూ కళ్లనీళ్లు చెరగుతో తుడుచుకుంది ముసలమ్మ. తెల్లవారింది. తాతతోగూడా బాబు యంత్రాలయానికి ప్రయాణమయ్యాడు. తాత ప్రక్కనే బరువులు మోయమన్నారు. అట్లాగే చేస్తానన్నాడు బాబు......

యంత్రాగారాధిపతి పార్థసారధికి సర్వఅవలక్షణాలు సంపూర్ణంగా

ఉన్నాయి. చక్కని పిల్ల కంటబడితే ప్రక్కకువమ్మనేందుకు వెనుదీయని ధూర్తుడు. మిల్లులో పనిచేస్తున్న కూలీల్ని కండ బలం, అండబలంతో బ్రహ్మాండంగా పాలించేస్తున్నాడు. ఏడు కొమ్ములు ఉన్నవాడుగాని పార్థసారథి ఎదుట నిలబడి మాట్లాడడానికి సాహసించడు.

ఈలాంటి పార్థసారథి రథానికి అతిరథుడు, అంగరక్షకుడు, నమ్మిన గులాము మిల్లుమానేజరు తిరపతిరాయుడు. ఈ రాయుడు బుర్రలో ఎల్లప్పుడు ఒకటే ఆలోచన. 'ప్రొద్దు గ్రుంకి గ్రుంకడంతోనే యీ పార్థసారథి రథాన్ని యెటు తోలడమా' అని. ఎందరి సుందరుల గుండెల్ని చీల్పించాడో! ఎందరి నిరపరాధుల రక్తాన్ని పీల్పించాడో! మితంలేదు. యజమాని పార్థసారథి తన కొరకు ఒక చిన్న మేడైనా 'నా కష్టానికి ఫలితంగా కట్టించి యీయక పోతాడా?' అనుకునేవాడు. దానికోసం నానాగడ్డి మేసేవాడు. ఆఖరుకి శారద యీ పాపాత్ముడు కంటిలోపడింది. వెంటనే చిక్కాలో ఎక్కించుకున్నాడు తిరపతిరాయుడు. యీ దఫాతో తనకట్టబోయే మేడకు పునాదులు లేచిపోతాయనుకున్నాడు. యీ చల్లటికబురు కాళ్ళుపిసుకుతూ పార్థసారథి చెవిలో పారేశాడు.

"ఇంక ఆలస్యందేనికి వెంటనే రథాన్ని నడుపు పో, అతి రథుడవై యుండి, ఏడవనా యీ మాత్రం చేయకపోతే" అన్నాడు పార్థసారథి.

"ఇదెంది బాబయ్యాగారూ! మీ అనుగ్రహం యుండాలిగాని చిటికెలో సాధించుకరాను, మనమేసిన బాణం, తిరిగిరాని రామబాణమని తమకు తెలియని సంగతా? యీ ఏడేడు పధ్నాలుగు లోకాల్లో తిరపతిరాయుడు మాటకు తిరుగులేదనుకోండి. నా బొందిలో ప్రాణమే ఉండాలిగాని కొండమీద కోతినైన తీసికొచ్చి మీ ఇంటిముందు కట్టెయ్యనూ? మీకా సందేహం ఎందుకూ? నేను బ్రతికున్నంతకాలంమిమ్మల్ని పూలరంగడల్లే పూజింపజేస్తాను" అంటూ ఏవేవో డప్పాలు కొడుతూ దాని చివర చిన్నమాట పారేశాడు: తమరు ఒకనాడు సెలవిచ్చిన సంగతి మర్చిపోయా రనుకుంటూను........."

అంటూండగానే పార్థసారథి మాటకు మధ్యలో అడ్డుతగిలి: "ఓహో! అదా మేడసంగతేగా నీ వనబోయేది? మర్చిపోయాననుకున్నావా పిచ్చివాడా? ఇది అయిన మర్నాడే పునాదులేచిపోతాయి. ఇంక సందేహం దేనికి? ముందు నీ పనిగానీ" అన్నాడు పార్థసారథి.

తిరపతిరాయుడు తంతు జరపడానికి తగిన ఏర్పాట్లు చేస్తున్నాడు.

"పని ముమ్మరంగాయుంది కాబట్టి రేపు రాత్రికి మిల్లు ఆగడానికి వీలు లేదు. భోజనాలు సాయంత్రం ఇచ్చటికే రప్పించుకో" మని కూలీలందరితో చెప్పి వెళ్లిపోయాడు తిరపతిరాయుడు.

బాబు నివాసం మిల్లుకి అరమైలు దూరముంటుంది.

మరుచటిరోజు సాయంత్రం శారద 'తాత, బాబుకి ఒక బుట్టలో అన్నం పెట్టి మిల్లుకు యిచ్చివస్తా' నని ముసలమ్మతో చెప్పింది.

"భద్రంగా వెళ్ళమ్మా! తోడు చూసుకొని మరీ వెళ్ళు" అందిముసలమ్మ.

"మరేం పరవాలేదమ్మా! మధ్యఅంతా ఊరేగా! అడివైతే కాదుగా భయమేయడానికి" అంది శారద.

గేటుదగ్గరే కాచాడు తిరపతిరాయుడు. శారద రావడం చూశాడు. దగ్గరగా వెళ్లి ఎంతో చనువున్నవాడల్లే పలుకరించి "నువ్వే తీసుకొచ్చావా? ఆ ముసలిది తీసుకురాలేకపోయిందా?" అన్నాడు.

"ముసలమ్మకు రాత్రులు కళ్లు సరిగా కనపడవు. అందుకని నేనే తీసు కొచ్చాను" అంది శారద.

"మీ ఆయన అయ్యగారి బంగళాలో యున్నాడు. అక్కడికే అన్నం తీసుకు రమ్మనమని నన్ను యిచ్చటికి పంపేడు. పద బంగళాలోనికి" అన్నాడు తిరపతిరాయుడు.

ప్రొద్దుపోయింది. దీపాలు పెడుతున్నారు. శారద బంగళాలో ప్రవే శించింది. బాబు కోసం నలువైపుల ఆతృతతో చూస్తోంది. నెమ్మది నెమ్మదిగా గేటు మూయబడింది. సింహద్వారంగూడా మూయబడింది. బాబును పిలుస్తూ పార్థసారథి కొలువున్న గదివరకు వెళ్లింది. నాల్గు మూలలు కలయజూచింది. ఎవరు పలుకలేదు. పార్థసారథి రెదురుగా నుంచున్నాడు. శారద గుండె బెదిరింది. భయంతో వణకిపోయింది. కేకవేసినా వినిపించేటట్టులేదు. పులి బోనులో చిక్కిన మేకపిల్లచందమైంది శారద జీవితం. ..................

తెల్లవారింది. శారద యింటికి చేరలేదు. బాబుకు శారద యింటికి చేర లేదని తెలిసింది. ఏమీపాలుపోలేదు. కర్తవ్యమూన్యుడైపోయాడు. శారద ఏమైంది? మాయగాయుందే! గేటు దగ్గర తిరపతిరాయుడు శారదతో

మాట్లాడినట్లు ఒక కూలి చెప్పాడు. తరువాత యేమిజరిగిందో తనకు తెలియు దన్నాడు. బాబుకు తిరపతిరాయుడు సంగతి తెలుసును. శరవేగంతో వెళ్లేడు. కళ్లు చింతనిప్పులలే ఎర్రగా వెలిగిపోతున్నాయి. శరీరం కంపిస్తోంది. ఆ భయంకర స్వరూపం తిరపతిరాయుడికి ప్రత్యక్షమయ్యేటప్పటికి నిలువునా ప్రాణాలు యెగసిపోయాయి. అతడి ముఖంలో మృత్యుకళలు తొణకులాడుతున్నాయి.

"శారద ఎక్కడుంది? ఏమైంది? నా శారదని ఏమిచేసావు? చెప్తావా? చెప్పవా?" అని బాబు హుంకరించేటప్పటికి తిరపతిరాయుడుకి నిలువుగ్రుడ్లు పడిపోయాయి. నోటినుండి మాట పెగలడంలేదు. పిల్లికూనల్లె ముడుచుకున్నాడు. ఇంకా ఉద్రిక్తుడైపోయాడు బాబు. తిరపతిరాయుడి మెడను రెండు చేతులతో నులిమేయడానికి సిద్ధంగాయున్నాడు. తిరపతిరాయ్డు రెండు చేతులు పైకెత్తి నమస్కరిస్తూ "ప్రాణ భిక్ష పెట్టండి. జరిగిందంతా చెప్తా" నన్నాడు. జరిగినదంతా బాబుతో చెప్పేశాడు............ బాబు తనలో లేడు. "శారదా............ శారదా............" అంటూ వెర్రి కేకలు పెడుతున్నాడు. ఇంతలో తాత, ముసలమ్మలు ఏడ్చుకుంటూ బాబు చుట్టూ గుమిగూడిన జనాన్ని తొలగించుకుంటూ బాబుకి యెదురువచ్చి పడిపోయారు.

"బాబూ! నీ శారద చెరువులో పడి చనిపోయింది. పద తొందరగా పద, నడు, కదలవేం బాబూ......? శారదని నేమైనా అన్నావా? బంగారంలాంటి పిల్లి చచ్చి చెరువొడ్డున పడుంది. పద నాయనా! తొందరగా నడు"

బాబుకి వేమీ వినపడ్డంలేదు. తలమీద పిడుగుపడినట్లయింది. అలాగే పడిపోయాడు....... రెండు రోజులవరకు తెప్పరిల్లలేదు. ఆ మైమరపులోనే కలవరింతలు.

"శారదా! నాతో చెప్పకుండా వెళ్లిపోయావా? నీకు నేను ఏమి అన్యాయం చేశానని నామీద అలిగావు? ఏనాడైనా ఒక్క మాటైనా అన్నానా? నిజం చెప్పు నిన్ను నేను యేమి అన్నాను? నామీద నీ కింత కోప మెందుకు వచ్చింది? శారదా శారదా!......" అంటూ నేయున్నాడు. మూడవ రోజు అర్ధరాత్రికి స్పృహ వచ్చింది. నెమ్మదిగా లేచాడు. నలువైపులు నిశ్శబ్దంగాయుంది.

చేతిలో గొడ్డలితో బాబు తిన్నగా పార్థసారథి బంగళాచేరాడు. పార్థసారథి ఇల్లాంటి ఘట్టాలు ఎన్నో చూశాడు. అందులో ఇదొకటి.

దీనికి విరుగుడు ఏమిచేయాలో పార్థసారథికి బాగా తెలుసును. ఇంతకుముందే ఒక వ్యక్తి తన్ను చంపడానికి కుట్రపన్నుతున్నట్లు చెప్పి పోలీసు కాపలా పెట్టించుకున్నాడు. బాబు సింహద్వారంలో ప్రవేశించేటప్పటికే పోలీసుల చేతుల్లో చిక్కిపోయాడు. హత్యాప్రయత్నం. యావజ్జీవ కారాగారవాసం విధించారు బాబుకి. ఆ నిర్భాగ్యుడే నిన్న చనిపోయిన బాబు. జీవితానంతరం గూడా బాబు ఖైదీగానే చనిపోయినట్లు చిట్టాలో వ్రాసుకుంటారు. 144 నెంబరు ఖైదీ చనిపోయాడంటారు. శరీరాన్ని ప్రాణాలు విడిచిపెట్టినా ఖైదీ దుస్తులు మాత్రం బాబు శరీరాన్ని అంటిపెట్టుకొనే ఉన్నాయి. పరలోకంలో గూడా బాబు ఖైదే. ఖైదీ బాబు గది ఖాళీ అయిపోయింది. ఈలాంటి బాబుల్ని యెందర్ని చూచిందో యీ రాతి గోడల గది. ఒక్కొక్క రాతిలో వేయి బాబుల హృదయాలు ఇముడుకొన్నాయి. ఎన్నో విషాద జీవులు ఇట్లాగ కాలగర్భంలో కలసిపోతాయి. రేపు మనమూ అంతే."

ఆ ఇద్దరు ఖైదీలు బాబు వ్యథ కథగా చెప్పుకునేటప్పటికి తెల్లవారింది. జైలు గంట గణగణ మ్రోగింది. వార్డరు తాళాలతో ఇనుప కటకటాలముందు ప్రత్యక్షమైనాడు.



జెమినీ ప్రింటర్సు, పవరుపేట - ఏలూరు.

## త్వరలో వెలుబడనున్న కళాఖండాలు

పల్లెటూరు.

సింహగర్జన.

చిత్రలేఖ.

ప్రతులకు—

వేమన్ బుక్ హౌస్

ఏలూరు.

ప. గో. జిల్లా.